# మనుచరిత్రము

ఆంధ్రకవితాపితామహ

అల్లసాని పెద్దనకవి ప్రణీతము




పబ్లిషర్సు

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో

రాజమండ్రి


వెల రు 1—50

# కథలు - చరిత్రలు

| | |
|---|---|
| భట్టివిక్రమార్కుని కథలు 200 పేజీలు | 1-50 |
| డిటో బైండు 500 పేజీలు | 4-00 |
| మైరావణ చరిత్ర పెద్దది | 1-50 |
| అభయరాఘవము | 0-75 |
| | 0-75 |
| | 1-50 |
| | 0-75 |
| | 1-50 |
| | 1-00 |
| | 1-50 |
| | 0-75 |
| | 0-12 |
| | 2-[illegible] |
| | 4-[illegible] |
| ...యిలు | 1[illegible] |
| వేములవాడ భీమకవి | 0[illegible] |
| శ్రీకృష్ణదేవరాయలు | 1[illegible] |
| మదనకామరాజు కథలు | 1-0[illegible] |
| పదహారురాజుల కథలు | 1-00 |
| నలమహారాజు కథలు | 0-75 |
| భోజకాళిదాసు కథలు | 1-00 |
| మహాపతివ్రతల కథలు | 1-00 |
| తెనాలి రామకృష్ణ కథలు | 1-00 |



కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు, బుక్ సెల్లర్సు, రాజమండ్రి.

శ్రీ

స్వారోచిష

# మనుచరిత్రము

అల్లసాని పెద్దనకవి ప్రణీతము.



పబ్లిషర్సు:

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో,

రాజమండ్రి.

1962

 [వెల రు 2—50]

# మనవి

భాషాభిమానులారా !

ఆంధ్రవాఙ్మయమునందు నానాటి కభివృద్ధి గాన్పించుచున్నది. భాషామతల్లి యగు సంస్కృతభాష మరల పునరుద్ధరింపబడి తల యెత్తుచున్నది. దానితోపాటు ఆంధ్ర సారస్వతము మీఁది యభిమానము స్థిరత్వమును జెందుచున్నది. వారువీరనక ప్రతివారును ప్రబంధములను కావ్యములను చేతబట్టుచున్నారు. అక్షరజ్ఞానము లేని బాలురుసహితము నేఁడు భాషాపరిజ్ఞాను లగుచున్నారు ప్రబంధకాలము మరల వచ్చునేమో యను నాసలు పొడసూపుచున్నవి. ఆంధ్రవాఙ్మయమునందలి ప్రథమ ప్రబంధకుసుమంబగు మనుచరిత్రమును, తద్గ్రంథకర్తయగు నల్లసాని పెద్దనార్యుని, తద్యశఃపతాకంబును వినని వా రుండరు. రమారమి క్రీ॥శ॥ పూర్వము వెయ్యేండ్ల నుండి సంస్కృతభాషయందలి యుద్గ్రంథముల ననువదించుటతోనే మహాకవులు కాలమును గడపిరి. స్వతంత్ర గ్రంథ రచన మంతవఱకు లేదనుట నిస్సంశయము. క్రీ॥శ॥ 1500 సం॥ ఆంధ్రభోజుఁడనుబిరుదు వహించిన కృష్ణదేవరాయలు విజయనగరరాజ్యమును బరిపాలించువాఁడు. అతని కాలమున స్వతంత్రగ్రంథరచనమారంభమయినది. రాయలు తన యాస్థానమునకు మహాకవుల ననేకుల రప్పించెను. అందులో నన్నివిధంబుల పేరెన్నికంగన్న యెనమండ్రకవులను పోషింపుచు నష్టదిగ్గజంబులని పేరిడి వారి ననంతప్రేమచే గనుంగొనుచు గావలసినదెల్ల వినుచు నుండెడివాఁడు. అష్టదిగ్గజములలో, మిగుల పేరొందినవాఁ డల్లసాని పెద్దనకవీంద్రుఁడు. ఇతఁడు నంద వైదిక బ్రాహ్మణుఁడు. నందవరీక బ్రాహ్మణుఁడని చెప్పుచు వీరేశలింగము పంతులుగారు నియోగియని వంచించిరేకాని దాని కాధారములు కానరావు. ఇతఁడు శఠగోపయతి శిష్యుడు. ఇతఁడు కేవల కవియేకాక విద్యాంసుఁడుకూడనై యుండెను. కృష్ణదేవరాయలు వెండిపళ్లెరమందు గండపెండేరము నొకదానినుంచి నిండు సభజేసి తన యాస్థానకవులఁ దిలకించి యుభయభాషాపాండిత్యము తేటతెల్లమగునటుల కవిత్వమును రచింపఁగలవారీసన్మానమునంద నర్హులని పల్క తక్కినవారంద ఊరకొనగా పెద్దనార్యుఁడు లేచి:—

ఉత్పలమాలిక.

పూఁత మెఱుంగులున్ బసరు పూపబెడంగులు చూపునట్టివా
కైతలు జగ్గునిగ్గునెనగావలెఁ గమ్మనఁ గమ్మనన్వలెన్

ఆంధ్రకవితాపితామహుఁడని బిరుదముకూడ యిచ్చెను. అప్పుడు గండ పెండేరము నొకదాని నిచ్చెను. ఇంకను ననేకములయిన బహుమతులచే నీ కవిని గారవించెను. అందువల్లనే కృష్ణదేవరాయలు మరణించిన దినమున పెద్దనార్యుఁడు తన విచారము నీ విధముగా వెల్లడించెను.

సీ. ఎదురైనచోఁ దన మదకరీంద్రముడిగ్గి,
గేలూత యొసఁగి యెక్కించుకొనియె
మనుచరిత్రం బందుకొను వేళఁబుర మేగ,
బల్లకి తనకేలఁ బట్టియెత్తె
బిరుదయిన కవిగండ పెండేరమున కీవె
తగుదని తానె పాదమునఁ దొడఁగె
గోకటగ్రామా ద్యనేకాగ్రహారము
లడిగిన సీమలయందు నిచ్చె
నాంధ్రకవితా పితామహ యల్లసాని
పెద్దన కవీంద్రయని నను బిలచునట్టి
కృష్ణరాయలతో దివి కేగలేక,
బ్రతికియుండితి జీవచ్ఛవంబ నగుచు.

ఈ మనుచరిత్రమును పెద్దన మార్కండేయ పురాణాంతర్గత కథ నాధారముగా గైకొని రచియించెను.

మనుచరిత్రమునందు గానుపించిన యసాధారణ కవితాధోరణి యా కాలము నాటి ముక్కుతిమ్మనార్యుని పారిజాతాపహరణము మొదలగు గ్రంథాదులయందు గానుపింపదు. దీనియందలి భాషాసాంప్రదాయములే పామరులచే గూడ నీ గ్రంథము ను పఠింపజేయుచున్నవి. గ్రంథపఠనమువలన భాషాజ్ఞానమేకాక సుగుణసంపదయు నలవడును.

—*—

శ్రీ

# స్వారోచిష మనుచరిత్రము

## ప్రథమాశ్వాసము

శ్రీవక్షోజకురంగనాభ మెదపైఁ జెన్నొంద విశ్వంభరా
దేవిన్ దత్కమలాసమీపమునఁ బ్రీతిన్ నిల్పినాఁడో యనం
గా వందారుసనందనాది నిజభక్తశ్రేణికిం దోఁచు రా
జీవాక్షుండు కృతార్థుఁ జేయు శుభదృష్టిం గృష్ణరాయాధిపున్. 1

ఉ. ఉల్లమునందు నక్కటిక మూనుట మీవలమందుఁ గంటి మం
చల్లన మేలమాడు నచలాత్మజ మాటకు లేఁతనవ్వు సం
ధిల్లఁ గిరీటిఁ బాశుపత దివ్యశరార్థునిఁ జేయు శాంబరీ
భిల్లుఁడు కృష్ణరాయల కభీష్ట శుభప్రతిపాది గాతవున్. 2

ఉ. నాలుగు మోముల న్నిగమ నాదము లుప్పతిలం బ్రచండవా
తూలహతిం జనించురొద తోడి గుహావళి నొప్పు మేరువుం
బోలెఁ బయోజపీఠి మునిముఖ్యులు గొల్వఁగ వాణిఁగూడి పే
రోలగ మున్న ధాత విభవోజ్జ్వలుఁ జేయుతఁ గృష్ణరాయనిన్. 3

ఉ. అంకముఁజేరి శైలతనయా స్తనదుగ్ధము లానువేళ బా
ల్యాంకవిచేష్టఁ దొండమున నవ్వలి చన్గబళింపఁ బోయి యా
వంక కుచంబు గాన కహివల్లభహారముఁ గాంచి వేమ్రు ణా
ళాంకుర శంక నంటెడు గజాస్యుని గొల్తు నభీష్టసిద్ధికిన్. 4

సీ. చేర్చుక్కగా నిడ్డ చిన్ని జాబిల్లిచే
సిందూరతిలకంబు చెమ్మగిల్ల
నవతంస కుసుమంబు నందున్న రొలఁదేటి
రుతి కించిదంచిత శ్రుతుల నీన

ఘనమైన రారాపు చనుదోయి రాయిడిఁ
దుంబీఫలంబు దుందుడుకుఁ జెందఁ
దరుణాంగుళిచ్ఛాయ దంతపు సరికట్టు
లింగిలీకపువింత రంగు లీన

గీ. సుపనిషత్తులు బోటులై యోలగింపఁ
బుండరీకాసనమునఁ గూర్చుండి మదికి
నించు వేడుక వీణ వాయించు చెలువ
నలువరాణి మదాత్మలో వెలయుఁగాత.

క. కొలుతున్ మద్గురువిద్యా
నిలయున్ గరుణాకటాక్ష నిబిడజ్యోత్స్నా
దళితాశ్రిత జనదురిత
చ్ఛలగాఢధ్వాంతసమితి శఠకోపయతిన్. 6

మ. వనజాక్షోపము వామలూరుతనయున్ ద్వైపాయనున్ భట్టబా
ణుని భాసున్ భవభూతి భారవి సుబంధున్ బిల్హణుం గాళిదా
సుని మాఘున్ శివభద్రు మల్హణకవిం జోరున్ మురారిన్ మయూ
రుని సౌమిల్లిని దండిఁ బ్రస్తుతులఁ జేకొందు న్వచశ్శుద్ధికిన్. 7

ఆ. వ్యాసరచిత భారతామ్నాయ మాంధ్రభా
షగ నొనర్చి జగతిఁ బొగడుఁ గనిన
నన్నపార్యుఁ దిక్కనను గృతక్రతు శంభు
దాసు నెఱ్ఱసుకవిఁ దలఁతు భక్తి. 8

మ. భరమై తోఁచు కుటుంబరక్షణకుఁ గాఁ బ్రాల్మాలి చింతన్ నిరం
తర తాళీదళసంపుటప్రకర కాంతారంబునం దర్థపుం
దెరువాటుల్ దెగి కొట్టి తద్జ్ఞపరిష ద్విజ్ఞాతచౌర్యక్రియా
విరసుండై కొఱఁతంబడుం గుకవి పృథ్వీభృత్సభాపంక్తులన్. 9

క. అని యిష్టదేవతావం
దనసుకవిస్తుతులుఁ గుకవితతినికృతియుఁ జే
సి నవీనకావ్యరచనకు
ననుకూలకథల్ దలంచు నాసమయమునన్. 10

సీ. ఉదయాచలేంద్రంబు మొదల నెవ్వాని క్షమా
రితకుఁ గ్రౌంచాచల రాజమయ్యె
నావాడపతి శకంధరసింధురాధ్యక్షు '
లరిగాపు లెవ్వాని, ఖరతరాసి
కాపంచగౌఢ ధాత్రీపదం బెవ్వాని
కనివారుగా నేఁగు నట్టిబయలు
సకలయాచకజనాశాపూర్తి కెవ్వాని
ఘనభుజాదండంబు కల్పశాఖి

గీ. ప్రబలరాజాధిరాజవీర ప్రతాప
రాజపరమేశ బిరుద విభ్రాజియెవ్వఁ
డట్టి శ్రీకృష్ణదేవరాయాగ్రగణ్యుఁ
డొక్కనాఁడు కౌతూహలం బుప్పతిల్ల. 11

సీ. ఇందీవరంబుల నీను క్రాల్గన్నుల
శరదిందుముఖులు చామరము లిడఁగ
బణిననూనుకణాద బాదరాయణసూత్ర
ఫక్కి విద్వాంసు లుపన్యసింపఁ
బార్శ్వభూమి నభీరు భటకదంబకరాళ
హేతిచ్ఛటాచ్ఛాయ నిరులుకొనఁగ
సామంతమండనోద్ధామమాణిక్యాంశు
మండలం బొలసి యీరెండ గాయ

గీ. మూరురాయరగండపెండారమణి మ
రీచిరింఛోళిఁ గలయ నావృతములగుచు
నంకపాళి నటద్దుకూలాంచలములు
చిత్రమాంజిష్ఠవిభ్రమ శ్రీవహింప. 12

క. భువనవిజయాఖ్య సంస
ద్భవనస్థితసింహపీఠిఁ బ్రాజ్ఞులగోష్ఠిన్
కవితామధురిమ డెందము
దవులం గొలువుండి సదయతన్ ననుఁ బల్కెన్. 13

తే. సప్తసంతానములలోఁ బ్రశస్తి గాంచి
ఖిలము గాకుండినది ధాత్రిఁ గృతియె కాన
కృతి రచింపుము మాకు శిరీషకుసుమ
పేశలసుధామయోక్తులఁ బెద్దనార్య. 14

క. హితుఁడవు చతురవచోనిధి
వతుల పురాణాగమేతిహాసకథార్థ
స్మృతియుతుఁడ వాంధ్రకవితా
పితామహుఁడ వెవ్వరీడు పేర్కొన నీకున్. 15

క. మనువులలో స్వారోచిష
మనుసంభవ మరయ రస సమంచిత కథలన్
వినిపింపు కలి ధ్వంసక
మనఘ భవచ్చతురరచన కనుకూలంబున్. 16

వ. కావున మార్కండేయ పురాణోక్త ప్రకారంబునం జెప్పుమని యడిగి కర్పూర తాంబూలంబు పెట్టినం బట్టి మహాప్రసాదం బని మోదంబున నమ్మహా ప్రబంధ నిబంధనంబునకుఁ బ్రారంభించితి నేతత్కథానాయక రత్నంబగు నమ్మహీనాథు వంశావతారం బెట్టి దనిన. 17

సీ. కలశపాథోరాశి గర్భవీచిమతల్లి
కడుపార నెవ్వానిఁ గన్నతల్లి
యనలాక్షు ఘనజటావనవాటి కెవ్వాఁడు
వన్నెఁ బెట్టు ననార్తవంపుఁ బువ్వు
సకలదైవత బుభుక్షాపూర్తి కెవ్వాఁడు
పుట్టుగానని మేని మెట్టవంట
కటికి చీకటి తిండికరముల గిలిగింత
నెవ్వాఁడు దొగకన్నె నవ్వఁజేయు

గీ. నతఁడు పొగఁడొందు మధుకైటభారి మఱఁది
కళల నెలవగువాఁడు చుక్కలకు ఱేఁడు
మిసిమి పరసీమ వలరాజు మేనమామ
వేవెలుంగుల దొరజోడు రేవెలుంగు. 18

తే. ఆసుధాధాము విభవ మహాంబురాశి
నుబ్బమీఱంగ నందనుఁ డుదయ మయ్యె
వేద వేదాంగ శాస్త్రార్థ విశదవాస
నాత్తధిషణా ధురంధరుం డైన బుధుఁడు. 19

క. వానికిఁ బురూరవుఁడు ప్ర
జ్ఞానిధి యుదయించె సింహసదృశుఁడు తద్భా
జానికి నాయువు తనయుం
డై నెగఁడె నతండు గనె యయాతి నరేంద్రున్. 20

క. అతనికి యదుతుర్వసు లను
సుతు లుద్భవ మొంది రహిత సూదనులు కళా
న్వితమతులు వారిలో వి
శ్రుతకీర్తి వహించెఁ దుర్వసుఁడు గుణనిధియై. 21

తే. వానివంశంబు తుళువాన్వయాయమయ్యె
నందు బెక్కండ్రు నృపు లుదయంబునొంది
నిఖిల భువన ప్రపూర్ణ నిర్ణిద్రకీర్తి
నధికులైరి తదీయాన్వయమునఁ బుట్టి. 22

మహాస్రగ్ధర. ఘనుఁడై తిమ్మక్షితీశాగ్రణి శరకమఠగ్రావసంఘాతవాతా
శనరాడాశాంతదంతి స్థవిరకిరుల జంజాటము ల్మాన్పి యిమ్మే
దిని దోర్దండైకపీఠిం దిరముపఱిచి కీర్తిద్యుతుల్ రోదసిం బ
ర్వనరాతు ల్నమ్రులై పార్శ్వములఁగొలువఁ దీవ్రప్రతాపంబునూ పెన్. 23

క. వితరణఖని యాతిమ్మ
క్షితిప గ్రామణికి దేవకీదేవికి నం
చితమూర్తి యీశ్వర ప్రభుఁ
డతిపుణ్యుడు పుట్టె సజ్జనావన పరుఁడై. 24

చ. బలమదమత్తదుష్టపురభంజనుఁడై పరిపాలితార్యుఁడై
యిలపయిఁ దొంటి యీశ్వరుడె యీశ్వరుఁడై జనియింప రూపఱెన్
జలరుహనేత్రలందొలఁగి శైలవనంబుల భీతచిత్తులై
మెలఁగడు శత్రుభూపతుల మేనులఁ దాల్చిన మన్మథాంకముల్. 25

సీ. నిజభుజాశ్రిత ధారుణీ వజ్రకవచంబు
            దుష్ట భుజంగాహితుండిపుండు
వనజేక్షణామనో ధనపశ్యతోహరుం
            డరిహంస సంసదభ్రాగమంబు
మార్గణ గణపిక మధుమాస దివసంబు
            గుణరత్నరోహణ క్షోణిధరము
బాంధవ సందోహ పద్మవనీ హేళి
            కారుణ్యరస నిమ్నగాకళత్రు

గీ. డనజగంబుల మిగులఁ బ్రఖ్యాతిగాంచె
ధరణి ధనదత్త వివిధోపధావిధాన
మార్జిత శ్రీ వినిర్జిత నిర్జరాల
యేశ్వరుఁడు తిమ్మభూపతి యీశ్వరుండు. 26

క. ఆయీశ్వర నృపతికిఁ
బుణ్యాయతమతియైన బుక్కమాంబకు దేజ
స్తోయజహితు లుదయించిరి
ధీయుతులగు నారసింహ తిమ్మనరేంద్రుల్. 27

క. అందు నరసప్రభుఁడు హరి
చందన మందారకుంద చంద్రాంశుని భా
స్పంద యశస్తుందిల ది
క్కందరుఁడై ధాత్రియేలె గలుషము లడఁగన్. 28

ఉ. శ్రీరుచిరత్వభూతిమతి జిత్వర తాకృతి శక్తికాంతులన్
ధీరతసారభోగముల ధీనిధి యీశ్వర నారసింహుఁ డా
వారిజనాథ శంకరుల వారిపమారుల వారితమ్ములన్
వారియనుంగు మామలను వారివిరోధులఁ బోలు నిమ్మహిన్. 29

సీ. అంభోధివసన విశ్వంభరావలయంబుఁ
            దన బాహుపురి మరకతముఁ జేసె
నశ్రాంత విశ్రాణనాసారలక్ష్మికిఁ
            గవికదంబముఁ జాతకములఁ జేసెఁ

గకుబంత నిఖిల రాజ్ఞికరంబుఁ జరణమం
జీరంబు సాల భంజికలఁ జేసె
మహనీయనిజ వినిర్మల యశస్సరసికి
గగనంబుఁ గలహంసకంబుఁ జేసె

గీ. నతిశితకృపాణ కృత్తమత్తారి వీర
మండలేశ సకుండల మకుటనూత్న
మస్తమాల్య పరంపరా మండనార్చి
తేశ్వరుండగు నారసింహేశ్వరుండు. 30

తే. ఆన్నృసింహ ప్రభుండు తిప్పాంబవలన
నాగమాంబికవలన నందనులఁ గాంచె
వీరనరసింహరాయ భూవిభుని నచ్యు
తాంశ సంభవుఁ గృష్ణరాయక్షితీంద్రు. 31

క. వీరనృసింహుఁడు నిజభుజ
దారుణ కరవాల పరుష ధారాహత వీ
రారి యగుచు నేకాతప
వారణముగ నేలె ధర నవారణ మహిమన్. 32

క. ఆవిష్ణు ననంతరము ధ
రావలయముఁ దాల్చెఁ గృష్ణరాయఁడు చిన్నా
దేవియు శుభమతి తిరుమల
దేవియునుం దనకుఁ గూర్చు దేవేరులుగాన్. 33

సీ. తొలఁగెను ధూమకేతుక్షోభ జనులకు
నతివృష్టిదోష భయంబు వాసెఁ
గంటకాగమభీతి గడచె నుద్ధతభూమి
భృత్కంటకం బెల్ల నెత్తువడియె
మానె నఘస్ఫూర్తి మరుభూములందును
నెలమూడువానలు నిండఁ గురిసె
నాబాలగోపాల మఖిలసద్వ్రజమును
నానందమున మన్కి నతిశయిల్లెఁ

గీ. ప్రజలకెల్లను గడు రామరాజ్య మయ్యెఁ
జారుసత్త్వాఢ్యుఁ డీశ్వర నారసింహ
భూవిభుని కృష్ణరాయఁ డభ్యుదయ మొంది
పెంపుమీఱంగ ధాత్రిఁ బాలింపుచుండ. 34

మ. అలపోత్రిప్రభుదంష్ట్ర భోగివరభోగాగ్రాళిరా లుద్భటా
చలకూటోపలకోటిరాపుచెడ నిచ్చల్ రాయఁగా నైన మొ
క్కలు భూకాంతకు నున్న నయ్యె నరస క్ష్మాపాలు శ్రీకృష్ణరా
యలబాహామృగ నాభిసంకుమద సాంద్రాలేప పంకంబునన్. 35

ఉ. క్రూరవనేభదంతహత కుడ్యపరిచ్యుతవజ్రపంక్తిఁ బో
ల్పారుమిడుంగుఱుంబురువు లంచు వెసం గొనిపోయి పాంత శృం
గార వనద్రుమాళి గిజిగాడులుగూడులఁ జేర్చు దీపికల్
గారహిఁ గృష్ణరాయ మహికాంతుని శాత్రవపట్టణంబులన్. 36

సీ. తొలుదొల్త నుదయాద్రి శిలఁ దాఁకి తిండ్రించు
నసి లోహమున వెచ్చనయి జనించె
మఱి కొండవీ డెక్కి మార్కొని నలియైన
యలకసవాప్త్రాతు నంటి రాఁజె
నటసాగి జమ్మిలోయఁ బడి వేగ దహించెఁ
గోల బిట్టేర్చెఁ గొట్టానఁ దగిలెఁ
గనకగిరిస్ఫూర్తిఁ గరఁచె గౌతమిఁ గ్రాఁచె
నవుల నాపొట్నూర రవులుకొనియె

గీ. మాడెములు ప్రేల్చె నొడ్డాది మసియొనర్చెఁ
గటకపురిఁ గాల్చె గజరాజు గలఁగి పఱవ
దోఁకచిచ్చన నౌర యుద్ధురత కృష్ణ
రాయబాహుప్రతాపజాగ్రన్మహాగ్ని. 37

మ. ధర కెంధూళులు కృష్ణరాయలచమూ ధాటీగతి న్వింధ్య గ
హ్వరముల్ దూఱఁగఁ జూచి తాఁ రచటఁ గాఁపైయుండుటం జాల న
చ్చెరువై యొట్టిని వింతచీఁకటులు వచ్చెం జూడరే యంచు పే
సారిదిం జూతురు వీరరుద్రగజరాట్ఛుద్ధాంత ముగ్ధాంగనల్. 38

చ. ఆఖిరతి కృష్ణరాయఁడు జయాంకములన్ లిఖియింప తాళస
న్నిభములఁ బొట్టునూరికడ నిల్పినకంబము సింహభూధర
ప్రభుతిరువాళ్ళకుం దిగు శుభప్రకరంబు కళింగ మేదినీ
విభు నపకీర్తి కజ్జలము వేములఁ బెట్టి పఠించు నిచ్చలున్. 39

మహాస్రగ్ధర

ఎకరాలన్ మందువాసాహిణములు గల భద్రేభసందోహ దాహ
ప్రకరంబుంగొంచుఁద త్తత్ప్రభువులనుపన్ రాయబారుల్ విలోకో
త్సుకులై నిత్యంబు శ్రీకృష్ణునియవసరముల్ చూతురందందకొల్వం
దకయాప్రత్యూష మాసంధ్యము పనివడి తన్మందిరాళిందభూమిన్. 40

చ. మదకలకుంభికుంభనవమౌక్తికముల్ గనుపట్టు దట్టమై
పదలక కృష్ణరాయ కరవాలమునం దగు ధారనీట న
భ్యుదయము నొంది శాత్రవుల పుట్టి మునుంగఁగ ఫేనపంక్తితోఁ
బొదిగొని పైపయిన్ వెడలు బుద్బుదపంక్తులువోలెఁ బోరులన్. 41

సీ. వేదండభయదశుండాదండనిర్వాంత
వమథువుల్ పెంజిల్కు వారిగాఁగ
దత్కర్ణవిస్తీర్ణ తాళవృంతోద్ధూత
ధూళిచేటలఁజల్లు దుమ్ముగాఁగ
శ్రమ బుర్బురత్తురంగమ నాసికోగ
త్పంకంబు వైచు కర్దమము గాఁగ
కుపితయోధాక్షిప్త కుంతకాంతార ఖే
లనములు దండఘట్టనలుగాఁగ

గీ. జెనఁటి పగఱ ప్రతాపంబు చిచ్చులార్చు
కరణి గడిదేశములు సొచ్చి కలఁచి యలఁచు
మూరురాయర గండాంక వీరకృష్ణ
రాయభూభృద్భయంకర ప్రబలధాటి. 42

—షష్ఠ్యంతములు—

క. ఏవం విధగుణవంతున
కావల్గత్తురగ బహువిధారోహ కళా
కోవంతున కతికాంతున
కావిష్కృత కీర్తి ధవళితా శాంతునకున్. 43

క. పుంఖానుపుంఖ సైంధవ
రింఖాసంఘాతజాత రేణూగ్ర తమో
రింఖ ద్రిపున్నృపద హార
ప్రేంఖద నుదగ్రసనజరర, భృత్య నిధణికిన్. 44

క. అవిరళ వితరణ విద్యా
నవ రాధేయునకు సజ్జన విధేయునకుం
గవితా స్త్రీలోలునకున్
కవిటంక నట ద్యశోబ్ధి కల్లోలునకున్. 45

క. దిగధీశా సహ్య ధగ
ద్దగి తేద్దరుచిర ప్రతాప తపనస్ఫురణ
స్థగిత ద్యుమణికి నిమిషా
ర్ధ గృహీతకళింగరాజ తనయాగ్రణికిన్. 46

క. కరుణాకర వేంకటవిభు
చరణస్మరణ ప్రసంగ సంగతమతి కీ
శ్వర నరసింహ మహీభృ
ద్వరనందన కృష్ణరాయ ధరణీపతికిన్. 47

వ. అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన స్వారోచిష మనుసంభవంబను మహాప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన జైమిని ముని స్వాయంభువమను కథాశ్రవణానంతరంబున మీఁద నెవ్వండు మనువయ్యె నెఱింగింపు మనవుడుఁ బక్షులు మార్కండేయుండు క్రోష్టికిం జెప్పిన ప్రకారంబున నిట్లని చెప్పందొడంగె. 48

మ. వరణాద్వీపవతీతటాంచలమునన్ వప్రస్థలీచుంబితాం
బరమై సౌధసుధాప్రభాధవళిత ప్రాలేయరుఙ్మండలీ
హరిణంబై యరుణాస్పదం బనఁగ నార్యావర్తదేశంబునన్
పుర మొప్పున్ మహికంఠహార తరళ స్ఫూర్తిన్వివాదంబించుచున్. 49

సీ. అచటి విప్రులు మెచ్చ రఖిల విద్యాప్రౌఢి
ముదిమది దప్పిన మొదటివేల్పు
నచటిరాజులు బంటు నంపి భార్గవునైన
బింకానఁ బిలుపింతు రంకమునకు

నచటి మేటికిరాటు లలకాధిపతులైన
　　　మును సంచి మొదలిచ్చి మనుప దక్షు
లచటి నాలవజాతి హాలముఖాత్తవిభూతి
　　　నాది భిక్షువు భైక్షమైన మాన్పు

గీ. నచటి వెలయాండ్రు రంభాదులైన నొరయఁ
గాసెకొంగున వారించి కడపఁ గలరు
నాట్యరేఖా కళాదురంధరనిరూఢి
నచటఁ బుట్టిన చిగురుగొమ్మైనఁ జేవ. 50

ఉ. ఆపురి బాయకుండు మకరాంకశశాంకమనోజ్ఞమూర్తి భా
షాపర శేషభోగి వివిధాధ్వరనిర్మలధర్మకర్మ దీ
క్షాపరతంత్రుఁ డంబురుహగర్భకులాభరణం బనారతా
ధ్యాపనతత్పరుండు ప్రవరాఖ్యుఁ డలేఖ్య తనూవిలాసుఁడై. 51

ఆ. వానిచక్కఁదనము వైరాగ్యమునఁజేసి
కాంక్ష సేయు జార కామినులకు
భోగబాహ్యమయ్యెఁబూచిన సంపెంగ
పోలుపు మధుకరాంగనలకుఁబోలె. 52

ఉ. యౌవనమందు యజ్వయును ధనాఢ్యుఁడునై కమనీయకౌతుక
శ్రీవిధిఁ గూఁకటుల్ గొలిచి చేసిన కూరిమి సోమిదమ్మ సౌ
ఖ్యావహయై భజింప సుఖులై తలిదండ్రులు గూడి దేవియున్
దేవరవోలెనుండి యిలుఁదీర్పఁగఁ గాపుగ మొప్పువానికిన్. 53

సీ. వరణాతరంగిణీ దరవికస్వరనూత్న
　　　కమలకషాయగంధము వహించి
ప్రత్యూషపవనాంకురములు పైకొను వేళ
　　　వామనస్తుతిపరత్వమున లేచి
సచ్ఛాత్రుడగుచు నిచ్చలు నేఁగి యయ్యేట
　　　నఘమర్షణ స్నాన మాచరించి
సాంధ్యకృత్యముఁ దీర్చి సావిత్రి జపియించి
　　　సైకతస్థలిఁ గర్మసాక్షి కెఱఁగి

గీ. ఫలసమిత్కుశ కుసుమాది బహుపదార్థ
తతియు నుదికిన మడుఁగు దోవతులుగొంచు
బ్రహ్మచారులు వెంటరా బ్రాహ్మణుండు
వచ్చు నింటికిఁ బ్రజ దన్ను మెచ్చి చూడ. 54

శా. శీలంబుం గులమున్ శమంబు దమముం జెల్వంపు లేఁబ్రాయముం
బోలంజూచి యితండు పాత్రుఁడని యేభూపాలుఁ డీ వచ్చినన్
సాలగ్రామము మున్నుగాఁగొనఁడు మాన్యక్షేత్రముల్ పెక్కుచం
దాలం బండు నొకప్పుడుం దఱుఁగ దింటం బాఁడియుంబంటయున్. 55

తే. వండనలయదు వేవురు వచ్చిరేని
నన్నపూర్ణవ నుద్దియా నతనిగృహిణి
యతిథులే తేర నడికిరేయైన బెట్టు
వలయుభోజ్యంబు లింట నవ్వారిగాఁగ. 56

సీ. తీర్థసంవాసు లేతెంచినారని విన్న
నెదురుగా నేఁగు దవ్వంతయైన
నేఁగి తత్పదముల కెఱఁగి యింటికిఁ దెచ్చుఁ;
దెచ్చి సద్భక్తి నాతిథ్యమిచ్చు
నిచ్చి యిష్టాన్నసంతృప్తులుఁగాఁ జేయుఁ
జేసి కూర్చున్నచోఁ జేరవచ్చు
వచ్చి యిద్ధరగల్గు వనధిపర్వతసరి
త్తీర్థమహాత్మ్యముల్ తెలియ నడుగు.

గీ. నడిగి యోజనపరిమాణ మరయు నరసి
పోవలయుఁజూడననుచు నూర్పులు నిగుడ్చు
ననుదినము తీర్థసందర్శ నాభిలాష
నాత్మ నుప్పొంగ నత్తరుణాగ్నిహోత్రి. 57

క. ఈవిధమున నభ్యాగత
సేవా పరతంత్ర సకల జీవనుఁడయి భూ
దేవ కుమారకుఁ డుండం
గా విను మొకనాఁడు కుతప కాలమునందున్. 58

సీ. ముడిచిన యొంటికెం జడ మూఁపు మున్వాన్నె
మెఁగముతోలు కిరీటము ధరించి
కకపాలకేగార కటకముద్రితపాణిఁ
గురుచలాతాముతోఁ గూర్చిపట్టి
యైణేయమైన యొడ్డాణంబు లవణిచే
నక్కళించినపొట్టమక్కళించి
యారకూటచ్ఛాయ నవఘళింపఁగజాలు
బడుగుదేహంబున భస్మమలఁది.

గీ. మిట్టయూరమున నిడుయోగపట్టె మెఱయఁ
జెవుల రుద్రాక్షపోగులు చవుకలింప
గావి కుబుసంబు జలకుండికయును బూని
చేరెఁ దద్గేహమాషధ సిద్ధుఁ డొకఁడు. 59

తే. ఇట్లు చనుదెంచు పరమ యోగీంద్రుఁ గాంచి
భక్తిసంయుక్తి నెదురేగి ప్రణతుఁ డగుచు
నర్ఘ్యపాద్యాది పూజనం బాచరించి
యిష్టమృష్టాన్న కలన సంతుష్టుఁ జేసి. 60

క. ఎందుండి యెందుఁ బోవుచు
నిందుల కేతెంచినార లిప్పుడు విద్వ
ద్వందిత నేఁడుగదా మ
న్మందిరము పవిత్రమయ్యె మాన్యుఁడనైతిన్. 61

క. మీమాటలు మంత్రంబులు మీ
మెట్టినయెడఁ బ్రయాగ మీపాద పవి
త్రామల తోయము లలఘు
ద్యోమార్గఝురంబు పౌనరుక్త్యము లుర్విన్. 62

ఉ. వానిది భాగ్యవైభవము వానిది పుణ్యవిశేష మిమ్మెయిన్
వాని దవంధ్యజీవనము వానిది జన్మము వేఱుసేయ కె
వ్వానిగృహాంతరంబున భవాదృశయోగిజనంబు పావన
స్నానవిధాన్న పానముల సంతసమందుచుఁ బోవు నిచ్చలున్. 63

తే. మానినాథ కుటుంబ జంబాల పటల
మగ్న మాదృశగృహమేధి మండలంబు
నుద్ధరింపగ నౌషధ మొండు గలదె
యుష్మదంఘ్రి రజోలేశ మొకటి దక్క. 64

క. నా విని ముని యిట్లను వ,
త్సా విను మావంటి తైర్థి కావళి కెల్లన్.
మీవంటి గృహస్థులసుఖ
జీవనమునఁ గాదె తీర్థసేవయుఁ దలఁపన్. 65

సీ. కాఁపుఱనున్న తంగటిజున్ను గృహమేధి
యజమానుఁ డంకస్థితార్థపేటి
పండిన పెఱటికల్పకము వాస్తవ్యుండు
దొడ్డిఁ బెట్టినవేల్పుగిడ్డికాఁపు
కడలేని యమృతంపు నడఁబావి సంసారి
సవిధమేరునగంబు భవనభర్త
మరుదేశపథమధ్యమ ప్రప కులపతి
యాఁకటి కొదవు సస్యము కుటుంబి

తే. బధిర పగ్వంధ భిక్షుక బ్రహ్మచారి
జటి పరివ్రాజ కాతిథి క్షపణకావ
ధూత కాపాలి కాద్యనాథులకుఁ గాన
భూసురోత్తమ గార్హస్థ్యమునకు సరియె. 66

క. నావుఁడుఁ బ్రవరుం డిట్లను
దేవా! దేవర సమస్తతీర్థాటనముం
గావింపుదు రిలపై నటుఁ
గావున విభజించి యడుగఁ గౌతుక మయ్యెన్. 67

శా. ఏ యే దేశములన్ వసించితిరి మీ రే యే గిరుల్ చూచినా
రే యే తీర్థములందుఁ గ్రుంకిడితి రే యే ద్వీపముల్ మెట్టినా
రే యే పుణ్యవనాళిఁ గ్రిమ్మరితి రే యే తోయధుల్ డాసినా
రా యా చోటులఁ గల్గువింతలు మహాత్మా నాకెఱింగింపరే. 68

తే. పోయి సేవింపలేకున్న బుణ్యతీర్థ
మహిమ వినుటయు సకల కల్మషహరంబు
గాన వేడెద ననిన నమ్మౌనివర్యుఁ
డాదరాయత్తచిత్తుఁడై యతని కనియె. 69

ఉ. ఓచతురాస్యవంశకలశోదధిపూర్ణశశాంక! తీర్థయా
త్రాచణశీలినై జనపదంబులు బుణ్యనదీనదంబులుం
జూచితి నందునందుఁగల చోద్యములం గనుగొంటి నాపటీ
రాచలపశ్చిమాచలహిమాచల పూర్వదిశాచలంబులన్. 70

శా. కేదారేశు భజించితిన్ శిరమునం గీలించితిన్ హింగుళా
పాదాంభోరుహముల్ ప్రయాగనిలయుం బద్మాక్షు సేవించితిన్
యాదోనాథసుతాకళత్రు బదరీనారాయణుం గంటి నీ
యా దేశం బన నేల చూచితి సమస్తాశావకాశంబులున్. 71

వ. అది యట్లుండ వినుము. గృహస్థరత్నంబ! లంబమాన రవి రథ తురంగ శృంగారచారుచామరచ్ఛటాపేక్షణక్షణోద్గ్రీవ చమర సముదాయం బగు నుదయంబునం గల విశేషంబులు శేషఫణికైన లెక్కింప శక్యంబే? అంధకరిపు కంధరావాసవాసుకి వియోగభవదుర్వ్యధా భోగభోగినీభోగభాగ పరివేష్టిత పటీరవిటపివాటి కాల్లదేలాలతావలయంబగు మలయంబునం గల చలువ వలువ యెయ్యది! అకటకట! వికటకూటకోటివిటంక శృంగాటకాఘాకమానశరదిందు బింబగళ దమృతబిందు దుర్దినార్ద్రీకృత వల్లకీ పల్లవ ప్రభంజన వరాంజన హస్తహస్తింబగు నస్తంబునంగల మణిప్రస్తరంబుల విశ్రాంతిఁ జింతించిన మేనం బులక లిప్పుడుం బొడమెడు స్వస్వప్రవర్తితవర్షిష్ణు ధరణీరుహ సందోహదోహదప్రధానాసమాన ఖేలదైలబిల విలాసినీ విలాసవాచాల తులాకోటికలకలా హూయమాన సమదాళస మరాళంబగు రజతశైలంబు నోలంబులంగాలగళు విహార ప్రదేశంబులంగన్న సంస్మృతి క్లేశంబులు వాయువే! సతతమదజల శ్రవణపరాయణైరావణ విషాణకోటి సముట్టంకిత కటకపరిస్ఫురత్కురువింద కందళవ్రాతజాతాలాతశంకాపటదభ్రము భ్రమీ విభ్రమ దురంధరం బగు మేరుధరాధరంబు శిఖరంబుల సోయగంబులు గలయం గనుగొనుట బహుజన్మకృత సుకృతపరిపాకంబునం గాక యేలచేకూర నేర్చు? నేనిట్టి మహాద్భుతంబు లీశ్వరానుగ్రహంబున

నల్పకాలంబునం గనుగొంటి ననుటయు నీషదంకురిత హాసవగ్రనిష్ణగండ
యుగళుండగుఁ బ్రవరుం డతని కిట్లనియె. 72

చ. వెఱవక మీకొసర్తు నొక విన్నప మిట్టివి యెల్లజూచి రా
నెఱికలు గట్టుకొన్న మఱి యేండ్లును బూండ్లును బట్టుఁ బ్రాయపుం
జిఱుత తనంబు మీ మొగము సెప్పక చెప్పెడు నద్దిరయ్య! మా
కెఱుఁగఁ దరంబె మీ మహిమ లీర యెఱుంగుదు రేమి చెప్పుదున్. 73

క. అనినఁ బరదేశి గృహపతి
కనియెన్ సందియముఁ దెలియ నడుగుట తప్పా?
వినవయ్య జరయు రుజయును-
జెనకంగా వెఱచు మమ్ము సిద్ధుల మగుటన్. 74

మ. పరమంబైన రహస్య మా నయిన డాఁపం జెప్పెదన్ భూమిని
ర్జరవంశోత్తమ! పాదలేప మను పేరం గల్గు దివ్యౌషధం
పు రసం బీశ్వరసత్కృపం గలిగెఁ దద్భూరి ప్రభావంబునం
జరియింతుం బవమానమాన తిరస్కారిత్వరాహంకృతిన్. 75

క. దివి బిసరుహ బాంధవ సైం
ధవసంఘం బెంతదవ్వు దగ లే కరుగున్
భువి నంతదవ్వు నే మును
ఠవఠవ లే కరుగుదును హుటాహుటి నడలన్. 76

మ. అనిన న్విప్రవరుండు కౌతుకభర వ్యగ్రాంతరంగుండు భ
క్తినిబద్ధాంజలి బంధురుండు నయి మీదివ్యప్రభావం బెఱుం
గని నా ప్రల్లదముల్ సహించి మునిలోకగ్రామణీ! సత్కృపన్
నను మీ శిష్యుని దీర్ఘయాత్రవలనన్ ధన్యాత్ముఁగాఁ జేయరే. 77

క. అనుటయు రసలింగము నిడు
తనవట్రువ్రేఁపసజ్జ దంతపుఁబరణిన్
ను నిచిన యొకపస రిది యది
యని చెప్పక పూసెఁ దత్పదాంబుజ యుగళిన్. 78

క. ఆ మందిడి యతఁ డరిగిన
భూమీసురుఁ డరిగెఁ దుహిన భూధరశృంగ
శ్యామల కోమల కానన
హేమాఢ్య దరీ ఝరీ నిరీక్షాపేక్షన్. 79

వ. అనిన విని యమ్మహీసురవరుం డట్లరిగి యెట్లు ప్రవర్తించె నతని పుణ్య
వర్తన శ్రవణంబు మనంబునకు హర్షోత్కర్షంబు కల్పించెఁ దద్వార్తా వృత్తాం
తంబు కృపాయత్తచిత్తంబున నానతీయ వలయునని యడుగుటయును. 80

శా. గంగాస్వచ్ఛతరంగభంగిక యశోగాఢచ్ఛవిచ్ఛన్న సా
రంగాంకాంకనిరంకుశప్రతికళాప్రౌఢిప్రియంభావుకా
గాంగేయాచల చాపనూపుర వచోగాంభీర్య లీలాస్పదా
బంగాళాంగ కళింగభూప సుభటాభ్రశ్రేణి ఝంఝానిలా. 81

క. మండలిక తపన శోభిత
కుండలిపతి శయన కర్ణ కుండలిత రసా
ఖండ కవి కావ్య దిగ్వే
దండ శ్రుతిదళనకలహ తాడిత పటహా. 82

ఉత్సాహము

కుకురుకాశకురుకరూశ కోసలాంధ్రసింధు బా
హ్లీక శకాంగ వంగసింహళేశ కన్యకామణి
ప్రకరపాణిఘటితరత్న పాదుకాకలాచికా
ముకురవీటికాకరండ ముఖ్యరాజలాంఛనా. 83

ఇది శ్రీ మదాంధ్రకవితా పితామహ సర్వతోముఖాంక పంకజాక్షు
పాదాంబుజాధీన మానసేందిందిర నందవరపురవంశోత్తంస
శఠకోపతాపస ప్రసాదాసాదిత చతుర్విధకవితామతల్లి
కాల్లసాని చొక్కయామాత్యపుత్ర పెద్దనార్య
ప్రణీతంబయిన స్వారోచిష మనుసంభవం
బను మహాప్రబంధమునందు
ప్రథమాశ్వాసము
సంపూర్ణము



శ్రీ

స్వారోచిష

# మనుచరిత్రము



## ద్వితీయాశ్వాసము



శ్రీఖండశీతనగమ,
ధ్యాఖండక్షోణిమండలాఖండల వి
ద్యాఖేలన భోజసుధీ
రేఖద్రుమ కృష్ణరాయ లీలామదనా. 1

వ. అవధరింపుము జైమినిమునీంద్రునకుం బ్రజాసాంద్రంబులగు పక్షీంద్రంబు
లవ్వలికథ యిట్లని చెప్పందొడఁగె. 2

చ. అటఁ జని కాంచె భూమిసురుఁ డంబర చుంబిశిరస్సరజ్ఝరీ
పటల ముహుర్ముహుర్లుఠదభంగతరంగమృదంగనిస్వన
స్ఫుటనటనానుకూలపరి ఫుల్లకలాపకలాపిజాలమున్
కటకచరత్కరేణుకరకంపితసాలము శీతశైలమున్. 3

వ. కాంచి యతరంగమునఁ దరంగితంబగు హర్షోత్కర్షంబున. 4

క. నరనారాయణచరణాం
బురుహద్వయభద్రచిహ్నముద్రితబదరీ
తరుషండమండలాంతర
సరణిన్ ధరణీసురుండు సనఁ జన నెదుటన్. 5

క. ఉల్లలదలకా జలకణ
పల్లవిత కదంబ ముకుళ పరిమళలహరీ
హల్లోహలమదబంభర
మల్లధ్వను లెసఁగ విసరె మరుదంకురముల్. 6

సీ. తొండములూచి యందుగుఁజిగుళ్ళు ఋనుక్క
కరులదంతచ్ఛాయ కడలుకొనఁగ
నెలవులవనదంశములు మూఁగి నెఱవెట్ట
గ్రోల్పులు ల్బాదరిండ్ల గుఱకలిడఁగ
సెలయేటియిసుకలంకల వరాహంబులుఁ
మొత్తమ్ములై త్రవ్వి ముస్తెలెత్త
నడ్డంబు నిడుపు నాపడ్డలగతి మను
బిళ్ళుడొంకలనుండి క్రేళ్ళుదాఁట

గీ. ప్రబలభల్లుక నఖభల్లభయదమథన
శిథిలమధుకోశవిసర విశీర్ణమక్షి
కాంతరాంతరదంతురితాతపమునఁ
బుడమి తిలతండులన్యాయమున వెలుంగ. 7

క. పరికించుచు డెండంబునఁ
బురికొను కౌతుకముతోడ భూమిసురుఁ డ
గ్గిరి కటక తట నిరంతర
తరు గహన గుహావిహార తత్పర మతియై. 8

సీ. నిడుద పెన్నెతిగుంపు జడకట్టి సగరు మ
మ్మనుమండు తపము గైకొనినచోటు
జఠరకచ్ఛపపతేశ్వరు వెన్ను గాన రా
జగతికి మిన్నేరు దిగినచోటు
పుచ్ఛడీకతనంబు పోఁబెట్టి గిరికన్య
పతిఁగోర్వ నాయాసపడిన చోటు
వలరాచరాచవాఁడలికాక్షు కనువెచ్చ
గరఁగిన యల కనికరఁపు జోటు

గీ. తపసియిల్లాండ్ర చెలువంబు దఁలచి తలఁచి
మున్ను మచ్చిచ్చును విరాళి గొన్నచోటు
కనుపపులెంవేల్పుఁ బడవాలుఁగన్న చోటు
హర్షమునఁ జూచి ప్రవరాఖ్యు డాత్మలోన 9

చ. విలయకృశానుకీలముల వేఁడిమి బోడిమి మాలి క్రేల్మిడిన్
గలసిన భూతధాత్రి మఱి క్రమ్మర రూపయి నిల్చియో షధుల్

మొలవఁగఁ జేయుఁబట్టి నయముం బ్రతికల్పము నెట్టు గాంచు నీ
చలిమలవల్ల నుల్లసిలు చల్లఁ దనంబును మానఁడిందునన్. 10

సీ. పసుపు నిగ్గులదేఱు పాఁపజన్నిద మొప్పఁ
బ్రమథాధిపతియింటిపట్టెఱింగ
శచి కీర్తిఁగఁ బాపుచు జడలేట సురరాజు
జల కేళిసవరించు చెలు వెఱింగ
వదనుతోఁ జేఁపి చన్నవిసియోషధుల మ
న్నొందవు కొండలనెల్లఁ బిదుక నెఱిఁగ
వేల్పుటింతులలోన విఱ్ఱవీగుచు మేన
నవరత్నరచనల రవణ మెఱిఁగఁ

గీ. బరిపరివిధంపు జన్నంపుఁ బరికరంపు
సొంపుసంపద నిఖిలనిలింపసభయు
నప్పటప్పటికిని జిహ్వా తృప్తి దుల్ల
నా మెత లెఱింగ నీ తుషారాద్రికతన. 11

మ. తలమే బ్రహ్మకునైన నీ నగమహత్త్వం బెన్న నే నియ్యెడం
గలచోద్యంబులు రేపు గన్గొనియెదం గాకేమి నేఁ డేఁగెదన్
నళినీబాంధవభానుతప్తరవికాంతస్యందినీహారకం
దళచూత్కారపరంపరల్ పయిపయిన్ మధ్యాహ్నముం దెల్పెడిన్. 12

గీ. అనుచుఁ గ్రమ్మఱ వేళ నీహారవారి
బెరసి తత్పాదలేపంబు గరఁగిపోయెఁ
గరఁగి పోవుట యెఱుఁగఁ డద్ధరణిసురుఁడు
దైవకృతమున కిల నసాధ్యంబు గలదె. 13

మ. అతఁ డల్లౌషధహీనుఁడై నిజపురీ యాత్రామిళత్కౌతుకో
ద్ధతిఁ బోవన్ సపదిస్ఫుటార్తిఁ జరణద్వంద్వంబు రాకుండినన్
మతిఁ జింతించుచు నవ్విధం బెఱిఁగి హా! నన్నిట్లు దైవంబ! తె
చ్చితె యీఘోరవనప్రదేశమునకున్ సిద్ధోపదేశంబునన్. 14

క. ఎక్కడి యరుణాస్పదపుర
మెక్కడి తుహినాద్రి క్రొవ్వి యే రాఁదగునే?
యక్కట! మును సను దెంచిన
దిక్కిది యని యెఱుఁగఁ గడలు తెరు వయ్యదియో. 15

మ. అకలంకాత్మధసత్త్వముం దెలియ మాయాద్వార కావంతి కా
శీ కురుక్షేత్ర గయా ప్రయాగములం జే సేవింప కుద్దండ గం
డక వేదండ వరాహ నాహారిపు ఖడ్గవ్యాఘ్ర మిమ్మ్రుంచుఁ గొం
డవ రాఁ జెల్లునె బుద్ధిజాడ్యజనితోన్మాదుల్ గదా శ్రోత్రియుల్. 16

సీ. నను నిముసంబు గానక యున్న నూరెల్ల
నరయు మజ్జనకుఁ డెంతడలు నొక్కొ
యెపుడు సంధ్యలయందు నిలువెళ్ళనీక న
న్నోమెడు తల్లియుం తొరలు నొక్కొ
యనుకూలవతి నాదు మనసులో వర్తించు
కులకాంత మది నెంత కుందునొక్కొ
గడఁ దోడునీడలై క్రీడించు సచ్ఛాత్రు
లింతకు నెంత చింతింతు రొక్కొ

గీ. యతిథిసంతర్పణంబు లేమయ్యె నొక్కొ
యగ్ను లేమయ్యె నొక్కొ నిత్యంబులైన
కృత్యములఁ బాపి దైవంబ కినుక నిట్లు
పారవైచితె మిన్నులు పడ్డజోట. 17

క. నను నిలు సేరు నుపాయం
బొనరింపఁగఁజాలు సుకృతి యొకఁ డొదవఁడొకో
యనుచుం జింతాసాగర
మున మునిఁగి భయంబు గదురఁ బోవుచు నెదురన్. 18

సీ. కులిశధారాహతి పొలుపునఁ బైనుండి
యడుగుమోవఁగఁ జేగురైన తటులఁ
గనుపట్టు లోయగంగానిర్ఝరము వాఁక
జలువయౌ నయ్యేటి కెలఁకులందు
నిసుక పట్టిన నేల నేచి యర్కాంశుల
జొరనీకదట్టమై యిరులు గవియు
క్రముక పున్నాగసారంగరంభానారి
కేళాదివిటపశాఖాంతరవీథిఁ

గీ. గరులు పికశారికాకీర కేకిభృంగ
సారసధ్వనిఁ దనలోని చంద్రకాంత
దరులు ప్రతిశబ్దమీన గంధర్వయక్ష
గానఘూర్ణిత మగు నొక్క కోనఁ గనియె. 19

క. కనుఁగొని యిది మునియాశ్రమ
మను తహతహవొడమి యిచట కరిగిన సాకుం
గన నగు నొక తెఱువ యని
మనమునఁ గల దిగులు కొంత మట్టువడంగన్. 20

చ. నికటమహీధరాగ్రతట నిర్గతనిర్ఝరధారఁ బాసి లో
యటఁ దలక్రిందుగా మఱఁకలై దిగుకాలువవెంట బూచు మ
ల్లిక లవలంబనంబుగ నళిప్రకరధ్వని చిమ్మ రేఁగ లో
నికి మణిపట్టభంగసరణిన్ ధరణీసురుఁ డేగి చెంగటన్. 21

శా. తావుల్ క్రేవలఁ జల్లు చెంగలువ కేదారంబు తీరంబునన్
మావుల్ క్రోవులు నల్లిబిల్లిగొను కాంతారంబునం దైందవ
గ్రావాకల్పిత కాయమానజటిల ద్రాక్షాగుళుచ్ఛంబులం
బూవుం దీవెల నొప్పు నొక్క భవనంబున్ గారుడోత్కీర్ణమున్. 22

క. కాంచి తదీయ విచిత్రో
దంచిత సౌభాగ్యగరిమ కచ్చెరువడి య
క్కాంచన గర్భాన్వయమణి
యించుక దరియంగ నచటి కేగుడు వేళన్. 23

క. మృగమద సౌరభవిభవ
ద్విగుణిత ఘనసారసాంద్ర వీటీగంధ
స్థగితేతర పరిమళమై
మగువ పొలుపు దెలుపు వొక్క మారుత మొలసెన్. 24

మ. అతఁ డావాతపరంపరా పరిమళ వ్యాపారలీలన్ జనా
న్వితమిచ్చోటని చేరఁబోయి కనియెన్ విద్యుల్లతా విగ్రహన్
శతపత్రేక్షణఁ జంచరీక చికురం జంద్రాస్యఁ జక్రస్తనిన్
నతనాభిన్ నవలానొకానొక మరున్నారీ శిరోరత్నమున్ 25

తే. అమలమణిమయ నిజమందిరాంగణస్థ
తరుణసహకార మూల వితర్ది మీఁద
శీతలానిల మొలయ నాసీన యైన
యన్నిలింపాబ్జ ముఖియు నయ్యవసరమున. 26

సీ. తతనితంబాభోగ ధవళాంశుకములోని
యంగదట్టపుఁ గావి రంగువలన
శశికాంత మణిపీఠి జాలువాఱఁగఁ గాయ
లుత్తుంగ కుచపాలి నత్తమిల్ల
దరుణాంగుళీఘాత తంత్రీ స్వనంబుతో
జిలిబిలిపాట ముద్దులు నటింప
నాలాపగతిఁ జొక్కి యరమోడ్పుఁ గనుదోయి
రతిపారవశ్య విభ్రమముఁ దెలుప

గీ. ప్రౌఢిఁ బలికించు గీత ప్రబంధములకు
గ్రమకరపంకరుహారత్న కటకఝుణఝు
ణధ్వనిస్ఫూర్తి తాళమానములు గొలుప,
నింపు దళుకొత్త వీణవాయించుచుండి. 27

ఉ. అబ్బురపాటుతోడ నయనాంబుజముల్ వికసింపఁ గాంతి పె
ల్లుబ్బి కనీనికల్ వికసితోత్పలపంక్తులఁ గ్రుమ్మరింపఁగా
గుబ్బమెఱుంగుఁ జన్గవ గగుర్పొడువన్ మదిలోనఁ గోరికల్
గుబ్బటిలంగఁ జూచె నలకూబరసన్నిభు సద్ధరామరున్. 28

ఉ. చూచి ఝళంఝళత్కటక సూచిత వేగ పదారవిందయై
లేచి కుచంబులుం దుఱుము లేనడు మల్లలనాడ నయ్యెడన్
బూచిన యొక్క పోక నునుబోదియఁ జేరి విలోకనప్రభా
వీచికలం దదీయ పదవీకలశాంబుధి వెల్లిగొల్పుచున్. 29

మ. మనమున్ పుట్టెడు కాంతలౌల్యము నిడన్ మోదంబు విస్తీర్ణతం
జూనుపన్ గోర్కులు గ్రేళ్లుద్రిప్ప మదిమెచ్చుల్ చెప్ప లల్లార్ప న
త్యనుషంగస్థితి తచ్చపాటొసఁగ నొయ్యారంబునం జంద్రికల్
దనుకం జూచె నతాంగి భూసురుఁ బ్రఫుల్లన్నేత్రపద్మంబులన్. 30

క. పంకజముఖి కప్పడు మై
సంకరితములయ్యెఁ బులక లావిష్కృత మీ
నాంకానల సూచక ధూ
మాంకురములుఁ బోలె మఱియు నతనిం జూడన్. 31

ఉ. తొంగలి ఱెప్పలం దొలఁగఁ ద్రోయుచుఁ బైపయి విస్తరిల్లు క
న్నుంగవ యాక్రమించుకొనునో ముఖచంద్రునటంచుఁ బోవ నీ
కంగజుఁ డానవెట్టి కదియన్ గుఱిఁబ్రాసె ననంగ జాఱి సా
రంగమదంబు లేఁజెమటఁ గ్రమ్మె లలాటము డిగ్గి చెక్కులన్. 32

మ. అనిమేషస్థితి మాన్పె బిత్తరపుజూ పస్వేదతావృత్తి మా
న్పె నవస్వేదసమృద్ధి బోధకళ మాన్పెన్ మోహవిభ్రాంతి తో
డనె గీర్వాణవధూటికిన్ భ్రమరకీట న్యాయ మొప్పన్ మను
ష్యుని భావించుట మానుషత్వము మెయిం జూపట్టె నా నత్తఱిన్.

వ. ఇట్లతనిరూపు రేఖావిలాసంబులకుఁ జొక్కి యక్కమలపత్రేక్షణ యాత్మగతంబున.

ఉ. ఎక్కడివాఁడొ యక్షతనయేందు జయంత వసంతకంతులన్
జక్కఁదనంబునం గెలువఁ జాలెడువాఁడు మహీసురాన్వయం
బెక్కడ యీతనూవిభవ మెక్కడ యేలనిబంటుగా మరుం
డక్కఁగొనంగ రాదె యకటా నను వీఁడు పరిగ్రహించినన్. 35

సీ. వదనప్రభూత లావణ్యాంబు సంభూత
కమలంబు లన వీని కన్ను లమరు
నిక్కి వీనులతోడ నెక్కసక్కెములాడు
కరణి నున్నవి వీని ఘనభుజములు
సంకల్పసంభవాస్థానపీఠిక వోలె
వెడఁదయై కనుపట్టు వీని యురము
ప్రతిఘటించు చిగుళ్ళ పై నెఱ్ఱవాఱిన
రీతి నున్నవి వీని మృదుపదములు

గీ. చేరెఁడేటి యసల్ తెచ్చి నీరజాప్తు
సానఁబట్టిన రాపాడి చల్లి మెదిపి

పసను సుధ నిడి చేసెనో పద్మభవుఁడు
వీనిఁ గాకున్నఁ గలదె యీ మేనికాంతి. 36

క. సుర గరుడోరగ నరఖే
చర కిన్నర సిద్ధసాధ్య చారణవిద్యా
ధరగంధర్వకుమారుల
నిరతము గనుఁగొనమె పోల నేర్తురె వీనిన్. 37

మ. అని చింతించుచు మీనకేతనధనుర్జ్యాముక్త నారాచదు
ర్దిన సమ్మూర్ఛిత మానసాంబురుహయై దీపించు పెందత్తఱం
బునఁ జేయెత్తిన లజ్జ నంఘ్రికటకంబుల్ మ్రోయ నడ్డంబు ని
ల్చిన నయ్యచ్చరఁ జూచి చేరఁ జనిపల్కెన్ వాఁడు విభ్రాంతుఁడై. 38

ఉ. ఎవ్వతె వీవు భీతహరిణేక్షణ యొంటిఁ జరించె దోటలే
కివ్వనభూమి భూసురుఁడ నేఁ బ్రవరాఖ్యుఁడఁ ద్రోవ తప్పితిం
గ్రొవ్వున నిన్న గాగ్రమునకున్ జనుదెంచి పురంబుఁ జేర నిం
కెవ్విధిఁ గాంతుఁ దెల్పఁగదవే తెరవ వెద్ది శుభంబు నీకగున్. 39

క. అని తనకథ సెఱిఁగించినఁ
దన కనుఁగవ మెఱుఁగులుబ్బ దాటంకములుం
జనుఁగవయు నడుము వడఁకఁగ
వనిత సెలవివాఱ నవ్వి వానికి ననియెన్. 40

ఉ. ఇంతలుకన్నులుండఁ దెరు వెవ్వరి వేఁడెదు భూసురేంద్ర ! యే
కాంతమునందు నున్న జవరాండ్ర నెపం బిడి పల్కరించు లా
గింతియకాక నీ వెఱుఁగవే మును వచ్చినత్రోవచొప్ప నీ
కింతభయంబు లేకడుగ నెల్లిద మైతిమి మాట లేటికిన్? 41

వ. అని నర్మగర్భంబుగాఁ బలికి క్రమ్మఱ నమ్మగువ యమ్మహీసురున కిట్లనియె.

సీ. చిన్ని వెన్నెలకందు వెన్నుదన్ని సుధాబ్ధిఁ
బొడమిన చెలువతోఁ బుట్ట మాఱు
రతిపుట్ట జంతగాత్రముల రాల్ గరగించు
విమలగాంధర్వంబు విద్యమాఱ

ననవిల్తు శాస్త్రంపు మినుకు లావర్తించు
పని వెన్నతోఁ బెట్టినది మాకు
హయమేధ రాజసూయము లనఁ బేర్వడ్డ
సవన తంత్రంబులుం జవులు మాకుఁ

గీ. గనకనగసీమఁ గల్పవృక్షములనీడఁ
బచ్చరాచట్టుగమి రచ్చపట్టు మాకు
పద్మసంభవ వైకుంఠ భర్గసభలు
సాముగరిడీలు మాకు గోత్రామరేంద్ర. 43

క. పేరు వరూధిని విప్రకు
మార ఘృతాచీ తిలోత్తమా హరిణీ హే
మా రంభా శశిరేఖలు
దారగుణాఢ్యలు మదీయ లగు ప్రాణసఖుల్. 44

మ. బహురత్నద్యుతిమేదురోదరదరీ భాగంబులం బొల్చు ని
మ్మహికాహార్యమునం జరింతు మెపుడున్ బ్రేమ న్నభోవాహినీ
లహరీ శీతల గంధవాహ పరిఖేల న్మంజరీ సౌరభ
గ్రహణోదిందిర తుందిలంబు లివి మత్కాంతార సంతానముల్. 45

క. భూసుర! కైతవ కుసుమ శ
రాసన! మాయింటి విందవైతివి గాకో
మ్మా సముదంచన్మణిభవ
నాసీనత సేదదేఱి యాతిథ్యంబున్. 46

తే. చందనమువంటి మేను మధ్యందినాత
పోష్మహతిఁ గందె వడదాఁకె నొప్పు లొలుక
వదన మస్మద్గృహంబు పావనము సేసి
బడలికలు వాసి చను మన్న బ్రాహ్మణుండు. 47

ఉ. అండజయాన నీ వొసగునట్టి సపర్యలు మాకు వచ్చె నిం
దుండఁగరాదు పోవలయు నూరికి నిప్పు డేను రా
కుండ నొకండు వచ్చి మతియొండుసె ? భక్తియ చాలు సత్క్రియా
కాండముదీర్ప వేగ చనఁగావలయుం గరుణింపు నాపయిన్. 48

ఉ. ఏ నిఁక నిల్లుసేరుటకు నెద్ది యుపాయము మీమహత్త్వము
ల్మానిని దివ్యముల్ మదిఁ దలంచిన వెంగును మీ కసాధ్యముల్
గానము నాన తల్లి ప్రజలన్ ననుఁ గూర్పు మటన్న లేఁతన
వ్వానవసీమఁ దోఁప ధవళాయతలోచన వాని కిట్లనున్. 49

ఉ. ఎక్కడియూరు కాల్నిలువ కింటికిఁ బోయెద నంచుఁ బల్కెదీ
వక్కట మీకుటీరనిలయంబులకున్ సరిరాకపోయెనే
యిక్కడి రత్నకందరము లిక్కడి నందనచందనోత్కరం
బిక్కడిగాంగసైకతము లిక్కడి యీ లవలీనికుంజముల్. 50

ఉ. నిక్కము దాపనేల ధరణీసురనందన యింక నీపయిం
జిక్కె మనంబు నాకు ననుఁ జిత్తజుబారికి నప్పగింతువో
చొక్కి మరందమద్యముల చూఱలఁ బాటలు వాడుదేంట్ల సొం
పెక్కిన యట్టి పూవుఁ బొదరిండ్లను గౌఁగిట గారవించెవో. 51

క. అనుటయుఁ బ్రవరుం డిట్లను
వనజేక్షణ యిట్లు పలుక వరుసయె ప్రతులై
దినములు గడపెడు విప్రులఁ
జనునే కామింప మది విచారము వలదే. 52

ఉ. వ్రేలిమియు న్సురార్చనయు విప్రసపర్యయుఁ జిక్కె భుక్తికిన్
వేళ యతిక్రమించె జననీజనకుల్ కడువృద్ధు లాకటన్
సోలుచుఁ జింతతో నెదురు సూచుచు నుండుదు రాహితాగ్ని నేఁ
మూలు సమస్తధర్మములుఁ దొయ్యలి నేఁ డిలు సేరకుండినన్. 53

ఉ. నావుడు విన్నఁబాటు వదనంబున నించుక దోఁప బల్కెనో
భావజరూప యిట్టి యెలప్రాయము వైదికకర్మనిష్ఠలం
వగ నింక భోగములఁ బొందుట యెన్నడు యజ్ఞకోటులం
బావములౌటకు న్ఫలము మా కవుఁగిళ్ళ సుఖించుటేకదా. 54

సీ. సద్యోవినిర్భిన్న సారంగనాభికా
హృత్తమై పిసాళించు మృగమదంబు
కసటువోబీటెండఁ గరఁగి కట్టలనంటి
గమగమవలచు జొక్కపు జవాజి

పొరలెత్తి ఘనసారతరువులఁ దనుఁ దాన
తొరఁగిన పచ్చకప్పురపుసిరము
గొజ్జఁగి పూఁబొదల్ఁ గురియుంగఁ బటికంపు
దొనరనిండినయట్టి తుహినజలము

గీ. వివిధకుసుమకదంబంబు దివిజతరుజ
మృదుల వసన ఫలాసనా మేయరత్న
భూషణంబులు గల విందు భోగపరుఁడ
వయి రమింపు నను౦ గూడి యనుదినంబు 55

క. అంధునకుఁ గొఱయె వెన్నెల
గంధర్వాంగనల పొందు గాదని సంసా
రాంధువుఁ బడియె దకట! ది
వాంధము వెలుఁగు గని గొంది నడఁగినభంగిన్. 56

ఉ. ఎన్నిభవంబులం గలుగు నిక్షుశరాసన సాయక వ్యథా
ఖిన్నత వాడి వత్తలయి కేలఁ గపోలము లూఁది మాపులన్
విన్నదనంబు తోఁప గను వేసుఱునం బయిగాలి సోకినన్
వెన్నవలెం గఱఁగు నలివేణులఁ గౌఁగిటఁ జేర్చు భాగ్యముల్ 57

క. కుశలతయే వ్రతముల నగు
వశ నాయాసమున నింద్రియ నిరోధమునం
గృశుఁడవయి యాత్మ నలంచుట,
సశరీరస్వర్గసుఖము సమకొనియుండన్ 58

తే. అనినఁ బ్రవరుఁడు నీవన్న యర్థమెల్ల
నిజము కాముకుఁడైలవానికి నకాము
డిది గణించునె జలజాక్షి యొఱఁగి తేని
నగరమార్గంబుఁ జూపిపుణ్యమునఁబొమ్ము. 59

క. బ్రాహ్మణుఁ డింద్రియవశగతిఁ
జిహ్మచరణైక నిపుణ చిత్తజనిశితా
జిహ్మగములపాలై చెడు
బ్రహ్మానందాది రాజ్య పదవీచ్యుతుఁడై 60

వ. అనిన నత్తెఱవ యక్కఱకరి పలుకుల కులికి గళిగళించి గధవ కరికరిం జెఱకు విలుకాఁడు పఱిగించు విరిదమ్మి గొరకలు నెఱవులఁ జాఱుపుచుఱుక్కునం గాడినఁగడుం గెరలి పరిణత వివిధ విటపతరు జనిత మధురమధురసం బాను మదంబునదటునం జిదిమిన నెఱుంగక మదన హతునైనఁజనునునం గడియు గమకించు తిమురునంగొనియె ప్రాయంపుమదంబునను ననన్య కన్యాసామాన్యలావణ్యరేఖా మదంబునను నొంటి పాటునం గంటికిం బ్రియుండై తం గేటిజంటి చందంబునం గొంటుదనం బెఱుంగక కుఱంగట నున్న యమ్మహీసురవర కుమార కారుణ్య మాఘ్యంబులం జేసి తన వైదగ్ధ్యంబు మెఱయఁగలిగెనని పల్లవించునుల్లంబు నుల్లాసంబునం గదురుమదంబున నోనరించుక చంచలదృగంచలప్రభ లకని ముఖాంబుజంబునం బొలయ వలయ మణి గణచ్ఛాయాలాపంబులుప్పరం బెగయఁ గొప్ప చక్కం జెక్కుచు జక్కవ గిబ్బలుంబోని గబ్బిగుబ్బలం జొబ్బిల్లు కుంకుమరసంబునం బంకిలంబులగు హారముక్తాతారకంబుల నఖకోరకరంబులం గీఱి తీరువడం జేయుచుఁ బతితవనతరు కుసుమ కేసరంబులు రాల్చు నెపంబునం బయ్యెద విదల్చి చక్కసవరించుచు సంతసం బొలయఁ జెలులం దలపూపకయుండ దత్తఱంబునం జేసిబొమముడిపాటుతో మగిడిమగిడి చూచుచు నంపరించు జంకెనల వారించుచుఁ జేరి యిట్లనియె. 61

శా. ఎందే డెందము గందళించు రహిచే నేకాగ్రతన్ నిర్వృతిం
జెందుం గుంభగత ప్రదీపకళికా శ్రీసోఁప నెందెందుఁ బో
కెందే నింద్రియముల్ సుఖంబు గను నా యింపే పరబ్రహ్మ మా
నందో బ్రహ్మ యటన్న ప్రాజ్ఞులు వు నంతర్బుద్ధి నూహింపుమా 62

గీ. అనుచుఁ దన్నొడఁబఱచు నయ్యమరకాంత
తత్తఱముఁ జూచి యాత్మ నతండు దనకు
నిగ్గు వెగటును బొడమ నిస్పృహతఁ దెలుపు
నొక్క చిఱునవ్వు నవ్వి యయ్యువిద కనియె. 63

శా. ఈపాండిత్యము నీకుఁ దక్క మఱి యెందే గంటిమే కామశా
స్త్రోపాధ్యాయిని నా వచించెదవు మేలోహో! త్రయీధర్మము
ల్పాపంబుల్ రతిపుణ్యమంచు నిఁక నేలా తర్కముల్ మోక్ష ల
క్ష్మీపథ్యాగమసూత్రపంక్తి కివె పో మీసాంప్రదాయార్థముల్. 65

మ. తరుణీ రేపును మాపు హవ్యములచేతం దృప్తుఁడౌ వహ్ని స
త్కరుణాదృష్టి నొసంగు సౌఖ్యము లెఱుంగన్ శక్యమే నీకు నా
కరణుల్ దర్భలు నగ్నులుం బ్రియములై రసట్లవ్యము ల్గావాడల్
తిరమే చెప్పుమిట్టి తుచ్ఛసుఖముల్ మీసాలపైఁ దేనియల్ 65

చ. అనుటయుమాటలేక హృదయాబ్జము చల్లన మోము వెల్లనై
కనలుచు నీరు దేఱు తెలిగన్నుల నాతనిఁ బల్కుపుల్కునం
గనుగొని మాటలం బొనుపు గద్గదికం దల యూఁచి యక్కటా!
వనిత తనంతఁ దా వలచి వచ్చినఁ జుల్కనగాదె యేరికిన్. 66

మ. వెతలం బెట్టకు మింక నన్ననుచు నీవీబంధ మూడన్ రయో
ద్ధతి నూర్పుల్ నిగుడన్ వడిన్ విరులు చిందం గొప్పు వీడం దనూ
లత దోడ్తోఁ బులకింపగా ననునయాలాపాతిదీనాస్యయై
రతిసంరంభము మీఱ నిర్జరవధూరత్నంబు పైపాటునన్. 67

శా. ప్రాంచద్భూషణబాహుమూలరుచితోఁ బాలిండ్లు పొంగారఁ బై
యంచుల్ మోవఁగఁ గౌఁగిలించి యధరం బానింప హా శ్రీహరీ
యంచున్ బ్రాహ్మణుఁడోరమోమిడి తదీయాంసద్వయం బంటిపొ
మ్మంచుం ద్రోచెఁగలంచునే సతులమాయల్ ధీరచిత్తంబులన్. 68

క. త్రోపువడి నిలిచి ఘనల
జ్జాపరవశ యగుచుఁ గొప్పు సవరించి యొడల్
దీపింప నతనిఁ జాఱచుఱఁ
గోపమునం జూచి క్రేఁటుకొనుచుం బలికెన్. 69

ఉ. పాటున కింతు లోర్తురె కృపారహితాత్మక నీవు త్రోవ్వని
చ్చోట భవన్నఖాంకురము సోఁకెఁ గనుంగొను మంచుఁ జూపి య
ప్పాటలగంధి వేదన నెపం బిడి యేడ్చెఁ గలస్వనంబుతో
మీటిన విచ్చుగుబ్బచనుమిట్టల నశ్రులు చిందువందగన్. 70

క. ఈ విధమున నతికరుణము
గా వనరుహనేత్ర కన్నుఁగవ ధవళరుచుల్
కావిఁకొన నేడ్చి వెండియు
నా విప్రకుమారుఁ జూచి యలమటఁ బల్కెన్. 71

ఉ. చేసితి జన్నముల్ తపము చేసితినంటి దయావిహీనతన్
చేసిన పుణ్యముల్ ఫలము సెందునె పుణ్యము లెన్ని యేనియుం
జేసినవాని సద్గతియె చేపరు భూతదయార్ద్రబుద్ధి కో
భూసురవర్య! యింతఁ దలపోయవు నీచదువేల చెప్పుమా? 72

సీ. వెలివెట్టిరే బాడబులు పరాశరుఁ బట్టి
దాశకన్యాకేళి తప్పఁజేసి
కులములో వన్నెతక్కువ యయ్యెనే గాధి
పట్టికి మేనక చుట్టరికము
ననుపుకాఁడై వేల్పు నాగవాసముఁగూడి
మహిమ గోల్పడియెనే మాందకర్ణి
స్వారాజ్యమేలంగ నీకైరె సుర లహ
ల్యాజారుఁడైన జంభాసురారి
గీ. వారికంటెను నీమహత్త్వంబు ఘనమె
పవనపర్ణాంబు భక్షులై నవసి యినుప
కచ్చడాల్ గట్టుకొను మునిముచ్చులెల్ల
తామరసనేత్రలిండ్ల బందాలుగారె. 73

తే. అనిన నేమియు ననక యవ్వనజగంధి
మేన జవ్వాది పస కదంబించునొడలు
గడగికొనివార్చి ప్రపరుఁడు గార్హపత్య
వహ్నినిట్లని పొగడె భావమునఁదలఁచి. 74

మ. దివిషద్వర్గము నీముఖంబునన తృప్తింగాంచు నిన్నీశుఁగా
స్తవముల్ సేయు శ్రుతుల్ సమస్త జగదంతర్యామివి నీవ యా
హవనీయంబును దక్షిణాగ్నియును నీయం దుద్భవించుం గ్రతూ
త్సవసంధాయక నన్నుఁ గావఁగదవే స్వాహావధూవల్లభా. 75

ఉ. దాన జపాగ్నిహోత్ర పరతంత్రుఁడ నేని భవత్పదాంబుజ
ధ్యాన రతుండ నేనిఁ బరదార ధనాదులఁ గోర నేని స
న్మానముతోడ నన్ను సదనంబున నిల్పు మినుండు పశ్చిమాం
భోనిధిలోనఁ గ్రుంకకయ మున్న రయంబున హవ్యవాహనా. 76

వ. అని సంస్తుతించిన నగ్నిదేవుం డమ్మహీదేవు దేహంబున సన్నిహితుండగు
టయు నమ్మహాభాగుండు గిండుమీఁటి పాదుపుఁగొండ నఖండ సంధ్యారాగ

ప్రభామండలాంతర్గతుం డగు పుండరీకవనబంధుండునుం బోలె నుత్తప్తకనక
ద్రవధారా గౌరంబగు తనుచ్ఛాయాపూరంబున నక్కానన వెలిగించుచు నిజగ
మన నిరోధిని యగు నవ్వరూధిని హృదయకంజంబున రంజిల్లు నమందానురాగ
రసమకరందబునందంద పాంగం జేయుచుం బావక ప్రసాదలబ్ధంబగు పవన
జవంబున నిజమందిరంబున కరిగి నిత్యకృత్యసత్కర్మకలాపంబులు నిర్వర్తించె
నని మార్కండేయుండు క్రోష్టికిం జెప్పెనని చెప్పిన. 77

క. జైమిని యాదివ్యఖగ
గ్రామణులం జూచి వేడ్కగడలుకొనంగా
నామీద వరూధిని విధ
మేమయ్యె నెఱుంగఁ జెప్పరే నా కనుడున్. 73

శా. నిస్తంద్ర ప్రతిభా సుధీనుత దిశో న్మీలద్యశశ్శ్రీవధూ
హ స్తగ్రామల కాయమాన మహనీ యాంభోజ గర్భాండ సై
న్యస్తోమోత్థ రజో వ్రజ స్థగిత కృష్ణాగౌతమీ మధ్య భూ
మ్యస్తోకోత్కల రాట్పురీ హరణ లీలావార్య శౌర్యోదయా. 79

క. బిసరుహనయనా నవవిధ
కుసుమాయుధ యవధికుధరకూటంగల ఘూ
విస్పృమర తేజశ్చంపక
భసలదసత్కీర్తి మలిన పరిపంధినృపా. 80

కవిరాజవిరాజితము

నల నృగరంతి భగీరథ భారత నందన కల్ప యనల్పయశ
శ్చులుకితలోక విలోకి వధూజన సూనశరాసన మానఖనీ
ప్రళయఘనాఘనఘోషజయానక భాంకృతిభీమన పేటలుర
త్కలబరిగీకటకక్షితిరక్షక కన్నడరాజ్యరమారమణా. 81

ఇది శ్రీ మదాంధ్ర కవితాపితామహ సర్వతోముఖాంక పంకజాక్ష
పాదాంబుజాధీన మానసేందిందిర నందవరపుర వంశోత్తంస
శఠకోపతాపస ప్రసాదాసాదిత చతుర్విధకవితామతల్లి
కాల్లసాని చొక్కయామాత్యపుత్ర పెద్దనార్య
ప్రణీతంబయిన స్వారోచిష మను సంభవం
బను మహాప్రబంధమునందుఁ
ద్వి తీ యా శ్వా స ము
సం పూ ర్ణ ము

—*—

శ్రీ

స్వారోచిష

# మనుచరిత్రము

* * *

## తృతీయాశ్వాసము

శ్రీ వేంకటేశపదప
ద్మావేశిత సదయహృదయ హరనిటలనట
త్పావక పరిభావిమహః
ప్రావృతనిఖిలాశ కృష్ణరాయ మహీశా. 1

వ. అవధరింపు మమ్మహాత్మునకుఁ బక్షు లిట్లనియె. 2

శా. ఆభూదేవకుమారుఁ డేఁగినఁ దదీయానూన రమ్యాకృతిం
దా భావంబుననిల్పి యంగభవకోదండోగ్రమౌర్వీరవ
క్షోభాకంపితధైర్యయై యలతనచ్చో నల్వకచ్చెల్వ త
ద్భూభృన్మేఖలవెంటఁ గానలఁ బడెన్ దుఃఖాబ్ధినిర్మగ్నయై. 3

క. తిరుగుచు ధరణీసురవరుఁ
డరిగిన చొప్పరసి యరసి యటఁ గానక యా
హరిణాంకముఖి సఖీజన
పరివృతయై మగిడి వచ్చి భావములోనన్. 4

ఉ. అక్కట వాఁడు నాతగుల మాఱడి సేసి దయావిహీనుఁడై
చిక్కక త్రోచిపోయె దరిజేరఁగరాని వియోగసాగరం
బెక్కడ నీదుదాన నిఁక నీకొఱనోములు నోచినట్టి నే
నెక్కడ వానికౌఁగిలది యెక్కడ హా విధి యేమి సేయుదున్. 5

ఉ. కమ్మనికుందనంబు కసుగందని మే నెలదేఁటి దాటులన్
బమ్మెరవోవఁ దోలు దెగబారెడు వెండ్రుక లందుబింబమున్

గిమ్మన నీదు మోము గిరి క్రేపులు మూఁపులు కొను గాన రా
దమ్మక చెల్లవాని వికచాంబకముల్ శతపత్రజైత్రముల్. 6

ఉ. చొక్కపుఁ బ్రాయమున్ మిగులసోయగముం గల ప్రాణనాయకుం
డెక్కడ వశ్యతన్ రతుల నేఁకటదీర్చి సమేళ మొప్పగా
నక్కున గారవించి ప్రియమందఁగ నోచనియింతి దైన యా
చక్కదనంబ దేమిటికి జవ్వన మేటికిఁ బ్రాణ మేటికిన్. 7

ఉ. ఎంత తపంబు చేసి జనియించినవారొకొ మర్త్యభామినుల్
కాంతుఁ డవజ్ఞ చేసినను కాయము వాయుదు రేనమర్త్యనై
చింతల వంతలం జివికి సిగ్గఱితిన్ మృతిలేని నాదు చె
ల్వింతయు శూన్యగేహమున కెత్తిన దీపిక యయ్యె నక్కటా! 8

వ. అని వితర్కించుచు గ్రించుదనంబునఁ బునఃపునః పరిభవకారియై కాఁచియుం బెట్టి సిరిపట్టి బెట్టేయుం గాఁడి చను నల రంపకట్టియల గుట్టుచేసి వెచ్చవెచ్చనై హెచ్చి విచ్చలవిడిం గాయు నుద్దామ విరహ దహనదాహంబున దేహంబు తల్లడిల్ల మల్లడిగొని పెల్లడరు నిట్టూర్పు గాడ్పువిసరులం గసరెత్తి యంత కంత కంతరంగంబున నింతంతనరాక పొంగి చింతాసాగరంబు వేగిరంబు వెల్లివొడిచెననం దుడిచినఁ దడంగక సారెకుం దారకల నీరికలెత్తుపొగరన నిగనిగ లినుమడిగ నిగుడ మిగుల వగలఁ బుగులుబుగులున నెగసి యెగసి యొప్పుల కుప్పలగు తెప్పలం జిప్పిలు కాటుక లప్పళించి కరించి దర దళదరుణ కమలదళశోణంబులగు దృక్కోణంబులం దిగువార కన్నీరు చెన్నారు కర్ణద్వయీగోళంబులు నిండి తనుతాపతప్తంబగు హాటకతాటంకయుగళంబునం బడి క్రొంబొగ లెగయింప బిసకిసలయసగంధంబగు మణిబంధంబునఁ జివురబంధంబుఁ జేర్చుకొని పొరలం దుఱిమిన విరు లురల నర విరిసి కలిసి యిరువుకొను గరగరని నెఱికురులు గుఱిగడవఁ బెరిగినవగుటం జేసి రాసివడి మెయి మూసికొని గ్రహగణంబులం జెన్నగుమిన్ను విఱిగిపయింబడినవడువున బెడంగు వడఁగలయుం దలకొను పులక మొలక పయిరునకుం బాఱు దుర్వారవారపూరంబనం గ్రమక్రమంబున నంగంబులం గ్రమ్ము చెమ్మటల మిన్నేటి పెన్నిటికట్టున మునుంగకుండ నవరించిన మించుకుంభప్లవంబునం బరిభ్రష్టోత్తరీయంబై యాలువడి యబ్బురపు గుబ్బచనుదోయి నిబ్బరంపు మెఱుంగు లీనం గుపిత హారనయన శిఖిశిఖాభస్మీకృత స్మర విరహశోకంబునం బడి

చందురునిం బట్టుకొని యడలు రతిరమణిచందంబునం గుసుమిత లతానిశాంత
శశికాంత వేదికాంతరంబున మేను సేర్చి వివిధాంతరంబుల నేఁగుచుండె నంత 9

చ. తరణి ననన్యకాంత నతి దారుణ పుష్పశిలీముఖ వ్యథా
భరవివశాంగి నంగభవు బారికి నగ్గముసేసి క్రూరుఁడై
యరిగె మహీసురాధముఁ డహంకృతితో నని రోషభీషణ
స్ఫురణ వహించెనో యన నభోమణి వాల్చెఁ గషాయదీధితిన్. 10

సీ. ఉరుదరీ కుహరసుప్తోత్థ శార్దూలముల్
ఝురవారిశోణిత శంకఁ ద్రావ
వనకుంజమధ్య శాద్వలచర న్మృగపంక్తి
దావపావకభీతి తల్లడిల్ల
నాశ్రమాంతర భూరుహాగ్రముల్
మునికోటిఁ బద్ధకాషాయవిభ్రాంతిఁ జూడ
ఘనసానుశృంగ శృంగాటకంబులఁ గాంచి
యమరులు హేమాద్రియనుచు వ్రాలఁ

గీ. గాసి పేశలరుచిఁ గింశుక ప్రవాళ
ఘుసృణ కిసలయ కంకేళి కుసుమగుచ్ఛ
బంధుజీవ జపారాగ బాంధవంబు
లన్నగంబున జరఠారుణాతపములు. 11

శా. శ్రేణుల్ గట్టి నభోంతరాళమునఁ బాఱెం బక్షు లుష్ణాంశు పా
షాణవ్రాతము కోష్ణమయ్యె మృగతృష్ణావార్ధు లింకెన్ జపా
శోణంబయ్యెఁ బతంగబింబము దిశాస్తోమంబు శోభాదరి
ద్రాణంబయ్యె సరోజషండములు నిద్రాణంబు లయ్యెం గడున్ 12

క. తరణి యిదె క్రుంకుచున్నాఁ
డరు దెమ్మని చంద్రుఁ బిల్వ నరిగెడు రజనీ
తరుణీమణి దూతిక లన
నరిగెం దూర్పునకు నీడ లతిదీర్ఘములై. 13

క. క్రుంకె నపరాంబురాశిం
బంకజబంధుండు దదీయ బడబాముఖవీ
ఝాంకరిత పతుకరధ్వని
రంకశవేగాప హృతశతాంగుఁడుఁ బోలెన్. 14

వ. ఆ సమయంబున, 15

సీ. ఏవిహంగముఁ గన్న నెలుఁగించు మును సారె
వను సైకతంబులఁ గూడఁ దారు
దారి కన్గొని యది తనజోడు గాకున్న
మెడయెత్తి కలయంగ మింట నరయు
నరసి కన్నీటితో మరలి తామరయెక్కు,
వదన మెండఁగ సరోవారి నద్దు
నద్ది త్రావఁగ సైప కట్టిటు గన్గొని
ప్రతిబింబ మీక్షించి భ్రమసి యులుకు

గీ. నుతికి రెఱకలు దడియ వేఱొక్క తమ్మి
కరుగు నరిగి రసంబులోఁ దిరుగు తేంట్ల
బాడుచు ముక్కున మఱియును బోవు వెదక
సంజఁ బ్రియుఁ బాసి వగ నొక్క చక్రవాకి. 16

సీ. రవిబింబ పతనదీర్ణ పయోధిగర్భని
ర్గత శేష ఫణిఫణారత్నరుచియొ
దివసావసానసందీప్తాస్తగిరిశిఖా
జ్యోతిర్లతాప్రతతానాతపంబొ
తపనఘూర్ద్దండనిర్ద్దళితదిక్తటదృశ్య
కమలజాండకటాహకనకఘృణియొ
చండీశతాండవోత్సవసంభృతతుషా,
హస్తాగ్రదీపగభస్తిచయమొ

గీ. ద్రాగ్విదాహచ్ఛిదావినిద్రాణమఘవ
దంజ నాలానమూలశయ్యావిధాన
వారుణాధోరణాకల్పితోరుశోణ
మృత్తికారాశియో యన మెఱసె సంధ్య. 17

క. బహుళజలప్లవమాన
ద్రుహిణాండము. చెమ్మ యుఱికి రూక్షార్కనిభా
రహితతఁ గాటుక పట్టును
రహిచెడి యన నంధతమసరాసులు బెరసెన్. 18

సీ. మృగనాభిపంకంబు మెయినిండ నలఁదిన
మాయాకిరాత మైచాయఁ దెగడి
నవపింఛమయభూష లవధరించి నటించు,
పంకజాక్షుని చెల్వు కుంకమడిగి
కాదంబనికురుంబకలితయై ప్రవహించు
కాళిందిగర్వంబుఁ గాకుసేసి
తాపింఛవిటపి కాంతారసంవృతమైన
యంజనాచలరేఖ నవఘళించి

గీ. కవిసె మఱియును గాకోల కాలకంఠ
కంఠకలకంఠ కరిఘటా ఖంజరీట
ఘనఘనాఘనసంఘాత గాఢకాంతిఁ
గటికిచీఁకటి రోదసీగహ్వరమున. 19

క. అంతటఁ బ్రాచి నిశాపతి,
యంతికగతుఁ డౌట విని ముఖాలంబితమః
కుంతలములు దీర్పఁగఁ గొను
దంతపుదువ్వెన యనంగ ధవళిమ దోఁచెన్. 20

చ. మరున కొసంగఁ గాలము తమశ్ఛట గాటుకగా నవోదయ
స్ఫురదరుణప్రభాపటక శోణితసిక్తసితోడు భక్తమున్
హరిహయదిఙ్నభస్థలమునన్ బలిచల్లి పటాంకమున్ వసూ
త్కరభరితంబునై వెలుఁగఁ గాంచి సుధానిధి నెత్తె నత్తరిన్. 21

మ. జలజాగారపరంపరల్ మఘవదాశాభిత్తిఁ దింద్రించుచున్
దళమై వెన్నెలచిచ్చు అంటిన మిళద్బాహ్యచ్ఛదశ్యామికా
చ్ఛలనం గంది మండుంగుచో సిమసిమ చ్ఛబ్దంబుతోఁ బుట్టు న
గ్గలపుం గ్రొంబొగలో యనంగ వెడలెన్ గర్భస్వరద్భృంగముల్. 22

సీ. శిథిల కైరవదళశ్రేణి నొక్కులు దీఱె
శశికాంతపంక్తుల జలము లూరె
గోరి కాంతులతోఁ జకోరికల్ రతిఁ గేరె
వారాశిగర్వంబు మేరమీఱెఁ

ద్రోపడి లురులు పటాపంచలై పాఱె
దిఙ్ముఖంబులవింత తెలివిసేరెఁ
జక్రవాకంబు లబ్జషండంగములఁ దూఱెఁ
గామినీకాంతుల కలకఁదేఱె

గీ. మదనుఁ డమ్ముల నూఱె హిమంబు పేరె,
జడిసి విరహిణి వగఁగూరె జారచోర
దర్పములు జాఱె రవికరతాపమాఱెఁ
జాడజాడఁగ దారకస్ఫురణ దాఱె. 23

మ. స్ఫుటసౌగంధిక రాగరిక్తరుచియైఁ బూనెం జపాసన్నిధి
స్ఫటికం బట్లుదయాద్రి గైరిక శిరస్థానస్థితిం జంద్రుఁ డ
చ్చోటు వాయన్ శుచియయ్యెనాఁ బ్రకృతినచ్ఛుండైనసన్మార్గి యె
న్నటికిం గూటమిబంక వచ్చు వికృతి న్మగ్నుండు గానేర్చునే. 24

శా. ఆరూఢస్థితిఁ జంద్రికాధవళితాజాండంబులోఁ జంద్రుఁ డొ
ప్పారెం గాలభిషగ్వరుం డవిరతంబై కాముకశ్రేణికిన్
మారోత్సాహము నిల్వ బాదరసమున్ బంధించి గ్రాసార్థమై
క్షీరస్థాలికఁ బెట్టినట్టి ఘుటికాసిద్ధౌషధంబో యనన్. 25

తే. రాజు తేజస్వియై గ్రహరాజు మీఁద
నలిగి దాడిగ వెంటాడ నిలువ కతఁడు
బెగడుపడి పాఱుచోఁ బెఱ దగిలినట్టి
ఛాయ యిది యన నీలలాంఛనము మెఱసె. 26

గీ. కలయ జగమునఁ గలయట్టి నలుపులెల్లఁ
దెలుపులుగ జేసి నీడలు తెలుపుసేయఁ
గా వశముగామిఁ బొడము దుఃఖమునఁ బోలె
సాంద్రచంద్రిక తుహినబాష్పములు గురిసె. 27

వ. మఱియు వికసితకైరవంబు లగు సరోవరంబుల నిజధవళధాళధళ్యంబున నాక్రమించి యందు నానందించు నరవిందమందిరవుం బుట్టినింటిసొబగుచూపి చూపఱవు నిందుబింబం బిది గ్రహంబులివియనునంతరంబు లేకుండ నేకవర్ణంబు గావించి సేవించు చకోరకదంబంబుల పుక్కిళ్ళకు వెక్కసంబై

ముక్కులకు నెక్కి చిక్కంబడి యుండొండ బొండుమల్లియల దండడిం దొఱగుపుప్పొళ్ళ నుప్పతిల్లు నెత్తావులకు వెకలులై యాడు మొకరితుమ్మెద లురొదలుగల మెఱుగుండుబురువులట్లు మిసమిసని మెఱవసని మెఱుంగు ముత్తెముల నుమిసి యుమిడి యందంద ప్రవహించు నిందూపల స్యందంబులకు విందు లగు నిందీవర మరందంబుల బెండడిం బడి బందనగొనువలిమంచు గ్రొమ్మించు బౌదులీఁది యీఁది వడిసడలి సుడివడుచు నొడలో ముసోమరి గాలి యలవోకసోఁకులం గదలెం గదలు వనం గదలు నుపవనకదళీ కేతకీ తాల హింతాల నారికేళ పూగావళీ కోమల పలాశ ప్రోశికల నునుపు గల పొరలయొరలశరధిశరగలమీఁదనుం బోలె గిఱికొని యొల్లవల్లికలుఁ బూవక పూచినట్లులసిల్లి తెల్లులసిల్లిన చందంబునం దెల్లతెల్లనై, మొల్లమిగనంతకంతకు దిగంతంబులుదంతంబులు దీరిచినయిడుపులుంబోలెఁ దీండ్రింప రేయెండఁ దానగుటం జేసియెండమావులం బుట్టించె వనం బట్టుగల పటికంపరాచట్టునేలల నెట్టుకొని వెండిచూం జిట్టకంబులకుం బెడమొగంబు వెట్టుకొని పట్టఁబట్టం బోబో ప్రాణభర్తల వెంటంబడి నూపురంబులు మొరయ వేనలులు విరియఁ గ్రమంబునం బుట్టు నిట్టూర్పుపవనంబు జవంబునం బైటకొంగ డలింప నందని కౌఁగిటం బొదవి ప్రియుంబు చిలుకం బలికి ముద్దాడు జవరాండ్ర దంతచంద్రికలసాంద్రతంబంతంబు మెఱసి మంత్రనంపు వేళలమాట తబ్బిబ్బునం బుట్టు పొలయలుకలం దలుపంచి రొదలేని నాలియేస్పు లేద్చు ప్రియులననునయింప నింపునం జనవు మెరసి చెక్కుకద్దంబులు నొక్కి మొగం బెగయనెత్తిముత్తియంపునుంగ అగంగునఁ గ్రడలుకొనుబుడిబుడి కన్నీటం బ్రతిఫలించి తుఱంగలించు తనగు నిగనిగలుగనుంగొని నగెనగెనను చుం జుంబనం బిడంబోయి కెంగేల నదరంట వాపువడు కాముకుల వెలవెలపాటుకూటువంగోటికిఁ బడగలెత్తి పిండిచల్లినగతిం గాయు డాయు లజ్జించి బుజ్జవంబునం బొదరిండ్లకు దార్చి కాంతులం గవయు నంగనామలకు నంగనల యంగంబులం పస ముంగిటం బడఁ జలితకిసలయాంతరాళంబులం దూఱిమూఱి యిరులు విరియించి సతుల ప్రార్థనంబులం బుంభావసురతాడంబరమునకుఁ దోడుసూపి సూపటిలి యంగరాగంబులు గరంగం జెమర్చిన చంచలాక్షుల నిద్దంపు తనూలతలం బుట్టి దట్టంబులగు చిఱుచెమట బొట్టులం బొడకట్టి తెలుపారు మలయజంపుఁ జిటులుగందంబుల యచ్ఛంబు లొసంగి సంజకడం దారు నొడివిన సంకేతంబులనుండక తెరవుగట్టి పొరువుదరువుల నీడల నడంగి నవ్వుటాలకు

వెనుకపాటునఁ గదిసి ముసుంగులెడలింప బెగడి కళవళంపుల జూపుల వల్లభులం జూచి యుల్లన నగు నభిసారికల వెడందకన్నుల చెన్నున వన్ను కొని పొదలు మదనోన్మాదంబునకుం బ్రోదిగా మోదంబున గాదంబరి గండూషించి విటకదంబంబునకు నొసంగు నంబురుహాముఖుల యొప్పుల కుప్పలగు నిప్పపూమొగ్గలంబోనిబుగ్గలం దగ్గలిక సూపుకమ్మ మంజుళ వజ్ర పుంజకచకలనకనకలు వీడుకొని కలికితనంబునంగలసి మెలసి రతాంతంబున బరిశ్రాంతి యడంగ నంగణంబులనిలిచి యొండొరుల కురులుదువ్వుచు విహరించుసమయంబున బల్లవులు కేళి కల్లప్పుడన్న తమమాటలు దలఁపించిన నదరిపడి మందస్మితంబులందరించు హుంకృతుల శంకించి కంకణంబు రత్నపుందళుకులు సెదర నుంకించి వైచు చేమంతి పూబంతులం బుటపుటనై మిటమిటంగాయు దట్టంపు పండువెన్నెల మెండున బెండువడి డెందంబు గంది తాలిమి చిందువందై కెందలిరుపాన్పునం దనువొందకలేచి కూర్చుండి కన్నీరు గోట మీటుచు బోటితో వరూధిని యిట్లనయె. 28

ఉ. నోములు నోఁచి నమ్మలు మనోరథముల్ దయివాఱ నిత్తఱిం
తామరతంపరై ప్రియులఁ దారు విహారము సల్ప వీరిలో
నీ మెయి దుఃఖశీల నగు నే వసియింపఁ దరంబె పోద మా
రామముఁ జూడ నందు సుకరం బగు సర్వము నంబుజాననా. 29

క. అని పలికి పాన్పు డిగి కా
మిని చంద్రాతపము వేడిమికిఁ బైఁట చెఱం
గున ముసుఁగిడి నిజకేళీ
వనిఁ జొచ్చి వియోగవహ్ని వడఁబడి తెగుఁవన్. 30

సీ. చనుఁగప్పు దొలఁగ వాసనగాలి కెదురేఁగు
బరువొప్పు నలుఁగులఁబాఱు కరణి
నిడుద వేనలి నూనె మడిపీడఁ జిగురాకుఁ
బోదఁ దూఱుఁ గార్చిచ్చుఁ గదియు కరణిఁ
బసిడివాజులు పైకి వెసఁ ద్రోచి నును దీఁగ
దెమలించు సురిత్రాడు సెమకు కరణి
మొలనూలు బిగియించి వెలఁది వెన్నెలఁ జొచ్చు,
బిఱుదీయు కేటిలో నురకు కరణి

గీ. జడియ దళులఁ గురియు పుష్పాదుల మునుఁగు
మావికడ నిల్చి విరులనెత్తావిఁ గ్రోలు
విషమసాయకు నేఁపుల వినివి వినివి
తనువుఁదొఱఁగంగఁ దలఁచి యవ్వనరుహాక్షి. 31

క. అట్టియెడ నమ్మృగేక్షణఁ,
బట్టి సఖీజనము వెడఁగుఁబట్టీ తగవే
యిట్టి తెగు వనుచుఁ జెక్కులఁ
దొట్టిన కన్నీరు వోవఁ దుడుచుచుఁ బలికెన్. 32

ఉ. పూతపసిండివంటి వలపున్ బచరించు కులంబు నీతికిన్
లేఁత గదమ్మ యిత్తెఱఁగు లేమ సురాంగనలెల్ల నిట్టి నీ
చేఁతకు మెత్తురమ్మ దయసేయక తిన్నని మేను వెన్నెలన్
వేఁతురఁటమ్మ యింత కను వేఁదుఱు సెల్లునఁటమ్మ యింతికిన్. 33

చ. ఉడుపతి బారికిన్ వెఱచి యూఱట యానని పేరటామనిన్.
ముడివడుకంతుసేనలకు మూయ్యెలగుట్టయినట్టి యిందు రా
నడఁగునె తాపవహ్ని మనమై హరిణేక్షణ ముల్లు పుచ్చి కొ
ఱ్ఱడచిన చందమయ్యెఁ బదమా యెలదోఁటఁ జరింప కింటికిన్. 34

క. అని యొడఁబడఁ బల్కుచుఁ దో
డ్కొనివచ్చినఁ బాన్పుఁజేరి గురుకుచ దనపై
గనకనఁ గనలెడు వెలుఁగులఁ
గనికర మఱి మండుచంద్రుఁ గని కర మలుకన్. 35

క. ఓచెల్ల విరహిణీవధ
మేచతురత నీకు దురితమే చేయూపనుల్
రాచరికపు ఫలమే య
య్యో చంద్ర వివేక మెఱుఁగ వోకొ గురుసేవన్. 36

సీ. తొలుదొల్తఁ గమలమిత్రునివంక రాపాట
దక్షాధ్వరధ్వంసి తన్నుఁ గనుట
బరివేషమిషమున బాశంబుఁ దాల్చుటఁ
గప్పు దేహమునందుఁ గానఁబడుట

గాలవశంబునఁ గాని తోఁపకయుంట
సతతనిష్ఠురగదాన్వితతఁ గనుటఁ
బూని పాండుక్షేత్రమునఁ బ్రవర్తించుటఁ
బ్రకటానురాగతారకఁ దగుటను

గీ. నంతరం బెద్ది యాత్మలో నరసి చూడ
రాజ నీవును నల ధర్మరాజునవును
బ్రాణిలోకంబు బాధలఁ బఱచునపుడు
ధర్మపద మొక్కఁ డెక్కఁ డా ధన్యునందు. 37

చ. ఒక పెనుఁబాపఁడేసు చఱమొప్ప రసాతలసీమకుం జకో
రకములు భూతధాత్రికి సురల్ దివికిం బగదీఱునట్లుగా
మెకమెకపాటుతోడ నిను మ్రింగకపో రెపుడుం ద్రిలోకకం
టకుఁడవు గాన నీయెడలు నజ్జుగఁజేసి కురంగలాంఛనా! 38

క. వాతాపివలన నెరిగితొ
శీతకిరణ కడుపుఁజొచ్చి జీర్ణింపని యీ
రీతి నిను దినియు నాయువు
చేత సురల్ చెడరుగాక చెఱుపవె వారిన్. 39

తే. త్రిపురసంహార మొనరించునపుడు హరుఁడు
బండికల్లుగ నీమేను గండిచేస
నదియు సెలవాఱె తెగటార వైతె చంద్ర
యకట రోహిణియెడ నపథ్యమునఁ జేసె. 40

తే. పాలఁబుట్టినమాత్రాన మేలిగుణము
నేఁడు నీకేలఁ గల్గు నో నీరజారి
నీటఁబుట్టినవాఁడు గా డోటు వహ్ని
గాల్చుచున్నాఁడు జగమెల్లఁ గరుణలేక. 41

క. గోవధము సేయు తుఱకల
దైవంబవు నీవు మొదలఁ దక్కఁక పాంథ
స్త్రీవధము సేయ రోయవె
నీవర్తన మేమి చెప్ప నీరజవైరీ. 42

క. విడువక తలపయిఁ గొన్నా
ళ్ళిడి చూచి కళంకి యకట యెఱిఁగి మహేశుం
డుడుపుచు దక్షాధ్వరమున
నడుగునఁ బడవైచె దాన నడఁగవు చంద్రా. 43

క. గాండీవము నీ చేతిది
పాండవునిం జేరఁబట్టి బ్రతికితి మా వి
ల్లుండిన నేఁడు నిశాచర
చెండవె యల్లునికిఁ దోడు శితభల్లమునన్. 44

వ. అని పలికి యక్కలికి తేనియలొలుకు పూములుకుల జళుకుఁ బుట్టించు నించు
విలుతు నుద్దేశించి. 45

చ. తొడిఁబడఁ బాఱి పైకొనికి ధూర్జటికంటికడింది మంటలో
నడపొడ గానరాక తెగటారియుఁ గాలినపుట్టి మ్రోడుకై
వడి రతిలోచనాంబువుల వాన నిగిర్చితె పాంథబాధకై
మడియ కనంగ యవ్వెలఁది మంగళసూత్రమహత్వ మెట్టిదో. 46

శా. సాహంకారత శంకరుం డలిగి నేత్రాగ్నిం బయిం బంపినన్
స్వాహాకాముకుఁ డౌట నిన్నతఁడుఁ గావంబోలు మోమోడి సం
దేహం బేని రతీశ నీవు మగుడన్ దేహంబుతో నుండు టె
ట్లాహా దైవము దోసకారులకె తోడై వచ్చు నెప్పట్టునన్. 47

చ. జడ నొక యింతలేని నెఱ చక్కదనంబుల నెల్లఁ గూర్పఁగాఁ
బొడవయినట్టి ధన్యుఁడవు భోగివి పూవిలుకాఁడ విట్టి నీ
వెడపక నిష్ఠురత్వమున కెట్లలవాటుగఁ జేసి తక్కటా!
పడఁతులమీద నేఁచు రతి పయ్యెదకున్ ననుపైన చేతులున్. 48

తే. అనుచు నిందించి వలవంత యినుమడింప
యవ్వరారోహ విదళిత హల్లకముల
కమ్మపుప్పొడిపై దుమారమ్ము రేఁచు
మలయమంథరపవనుపై నలుక వొడమి. 49

ఉ. అక్కట గంధవాహ తగవా హరిణాంకునిఁ గూడి పాంథులం
బొక్కఁగఁ జేయుఁ బావనుని పొందొనరించి జగమ్ము లేర్చు నీ

యక్కొఱగామి మానవది యట్టిద చుల్కనిస్పృత్తి దుర్జనుం
డొక్కనిఁ జొచ్చి క్రిందపడు నొండ్లకుఁ గీడొనరింపఁ గల్గినన్. 50

క. నాలుకలు రెండు నిన్నుం,
గ్రోలనె కల్పించె నలువ ఘోరాహికి న
న్నాలిగ్రహామి పుఁడుఁ దెగఁ దిన,
జాలద మృదుపవనవిరహి జనదురితమునన్. 51

వ. అని పలికి యక్కలకంఠకంఠి దీపించు తాపంబువెల్లువ మూర్ఛిల్లినం దోడి పల్లవోష్ఠు లల్లనల్లన హాల్లకంబుల హిమాంబుపూరంబులం గర్పూరపటీరకర్దమాసారంబులం జెంగావుల మృణాళఖండంబుల నంగంబులం జలువఘుట్టింప నెట్టకేలకుం దెలిసె నంతఁ బ్రభాతసమయం బగుటయు నొక్క పువ్వుఁబోడి వరూధినితో నిట్లనియె. 52

ఉ. పాటనసేయమిం గురులు పైఁబడి శీర్ణపటీరపంకలా
లాటికమై దరస్మితవిలాసఁపుఁజంద్రిక డొంకి వాడుటన్
దేటఁ దొఱంగి విన్ననగు నీ మొగమో యన మాసి చంద్రుఁడో
పాటలగంధి వ్రాలె నదె భానురుచిం దనకందు మీఱఁగన్. 53

సీ. సకుటుంబముగ వీఁగి చరమశైలముఁ జేరు,
తుహినాంశుఁ గ్రమ్ముదారు దొరయనంగ
నాసీరమై వచ్చు నలినబాంధవుపెక్కి
యంబుపై దీపించు నద్దమనఁగ
నరుణాగ్రనిబిడ వాద్యములలోఁ గనుపట్టు
సమయశాంఖికుచేతి శంఖమనఁగ
నినుఁ డప్పు డజుఁ డౌట మునుమున్న పడివాగ
గొనివచ్చురాయంచ కోదమయనగ

గీ. ఉదయగిరిమీఁద గోపురంబుండి నిగుడు
నహితర విరశ్మిచేబద్ధుడగుచుఁ దోడి
బలగమై నట్టిచుక్కల వలసత్రోవఁ
జూప నేతెంచె నన వేగుఁజుక్క వొడిచె 54

మ. సకలాశాగతి నర్మకోపవిరతి శ్రౌతక్రియారంభణా
త్మకవర్గత్రయికిన్ మదుచ్చరిత శబ్దజ్ఞాన మేమూల మిం

తఱఁ బోలన్ వినుఁ డంచుఁ దెల్పుగతిఁ జెంతం గొండపై పల్లెలం
గృకవాకు ల్మొరసెన్ గృహోపరిఁ ద్రిభంగిన్ భుగ్నకంఠధ్వనిన్ 55

మ. ఇనుఁ డస్తాద్రికిఁ బోవఁ గొల్లగొని నే దేతేరఁ దద్దీప్తి నం
జనసంబంధజబాంధవంబున రతి శ్రాంతాంగనానేత్రశో
ణనికాయంబుల దాఁచి తద్ధవళిమం దాఁబూనెనో చొప్ప మా
ర్పనసన్ వెల్వెలఁబాఱె దీపకళికావ్రాతంబు శాతోదరీ. 57

శా. వాలారుం గొనగోళ్ల నీ వలసతన్ వాయించుచో నాటకున్
మేళంబైన విపంచి నిన్న మొదలున్ నీవంటమిం జేసి యా
యాలాపంబె యవేళఁ బల్కెడుఁ బ్రభాతాయాతవాతాహతా
లోలత్తంత్రుల వేళవింపఁ గదవే లోలాక్షి దేశాక్షికిన్. 57

చ. పలుకులు నేర్పువేళ కలభాషిణి నీ నిటులుండఁ బంజరం
బుల నరగన్ను వెట్టి ముఖముల్ చరణాగ్రనఖాళిఁ గోఁకుచున్
నిలుగుచు నావులింపుచు వనీవిహగోత్కర మెట్లువల్కె న
ప్పలుకులె యఱ్ఱులెత్తి విన పల్కెడు వింటివె కీరశారికల్. 58

మ. ఉరుసంధ్యాతపశోణ మృత్కలితమై యొప్పారు బ్రహ్మాండము
న్గరిడిం గాలపుహోంతకాఁడు చరమాగస్కంధముం జేర్చి ని
బ్బరపున్ సంగడమో యనన్ శశి డిగెం బ్రాగ్భూమిభృత్కైతవే
తరబాహాగ్రపుసంగడం బనఁగ మార్తాండుండు దోచెన్ దివిన్. 59

చ. కరికరి గూఁట గఱ్ఱియిడఁగా మొరవెట్టెడులీల బాలభా
స్కరకరకాండకందళవిఘట్టన నించుక వాయివిడ్డ తా
మర మొఱవెట్టి పెట్టి పలుమాఱును వాకిలి దాఁటి యాఁగుచున్
మెరయు విపంచి మీటుగతి మ్రోసియళుల్ వెడలెం గొలంకులన్

చ. అడరు నవీన భానుకిరణానల ముంటినఁ గూడుకొన్న పు
ప్పొడి కొలుచెల్ల మోఁచికొని పోయెడి సంభ్రమ మొప్పఁగంటివే
పడఁతి భవద్విహారవన పద్మసరఃకుముదాలయంబునన్
వెడలు మిళిందబృందములు వీఁపుపిశంగిమకైతవంబునన్. 61

చ. కొలకొలఁ గూయుఁ బైనొఱఁగు గుత్తుకఁగుత్తుకజుట్టుఁబాఱు చి
ల్వలక్రియఁ గానరానిగతులన్ మయి మైబెనుచుం జనించు న

క్రు లఱుత నొత్తుసోలు నిలుచున్ విధిచాతురిఁ గూడియున్ రతిం
దలఁపవు కంటె పాసినవెతల్ దలఁపించుచుఁ గోకదంపతుల్. 62

ఉ. ఇందునిభాస్య వాఁడనఁగ నింద్రుఁడొ చంద్రుఁడొ యాయుపేంద్రుఁడో
యిందులకై వగం బొగుల నేఁటికి నేఁటికి నందుఁ బోద మా
నందనభూమి భూమిసురనందనుఁ డుండక పోఁడు రమ్ము నీ
చందము నందముం గనిన జవ్వని యెవ్వని వెఱ్ఱిఁ జేయదే. 63

ఉ. ఏల దురంతవేదన మెయిం బొరలాడెదు తాల్మి దక్కమే
లే లలితాంగి యెంతపని లె మ్మది విప్రవరుండు గోలయున్
బాలుఁడు గాన నప్పటికిఁ బైపడఁగొంకెను గాని వానికిన్
గా లొకచోట నిల్చునె వగన్మగుడన్ నినుఁ జూచునంతవున్. 64

క. రారమ్మనుటయు దివిష,
న్నారీరత్నంబు నికట నాకధునీక
ల్హారాంభోరుహమధురస,
ధారాచంద్రకితసలిల ధౌతాననయై. 65

సీ. ఘనసారపంక మొక్కలతాంగి దెచ్చిన
మట్టి వ్రేలనె చుక్కబొట్టువెట్టి
యింతియొక్కతె పూవుటెత్తులె త్తినఁ జూచి
విసువుతో నొకకొన్ని విరులుదురిమి
పడఁతి యొక్కతె రత్నపాదుక లిడనిల్చి
తొడుగక కవ్వలికిఁ బోనడుగువెట్టి
బాగాలు వెసనొక్క పద్మాక్షి యొసఁగిక
వెగ్గలంబని కొన్ని వెడల నుమిసి

గీ. సగము గొఱికిన యాకును సఖులు పిలువ
సగ మొసఁగు నుత్తరముఁ జెల్వ సగము మఱపు
సగము నయి చింతచే సగమగుచు నరిగె
నవ్వరూధిని యింతికోద్యానమునకు. 66

వ. ఆసమయంబున దేవజాతిత్వజనితవిమలజ్ఞానపాటవంబునం దద్వృత్తాంతంబు
సమస్తంబు నెఱింగుటజేసి. 67

శా. ఏగంధర్వుఁడు తద్విలాసముల మున్నీక్షించి తానెంతయున్
రాగాంధుండయి కోరి హత్తక గడున్ రారాపులం గంతుఁడు
ద్వేగంబందఁగఁజేయు నెవ్వగల నవ్వైఖ్యారుచున్ వేఁగువాఁ
డాగంధర్వకుమారుఁ డంగభవవిద్యాపారగుం డాత్మలోన్. 68

ఉ. ఒక్కొక వేళ పద్మముఖు లొల్లమి సేయుదు రొక్కవేళఁ బె
న్మక్కువ నాదరింతురు క్షణక్షణముల్ జవరాండ్రచిత్తముల్
పక్కన వేసటం జన దుపాయములం దగు నిచ్చకంబునన్
మక్కువ జేసి డాసి సతి చిత్తముఁబట్టి సుఖింపగాఁదగున్. 69

క. అని తలఁచి యవ్విలాసిని
యనిశము గ్రీడించు పుష్పితారామంబున్
మునుకలుగఁ జొచ్చి యొక చం
దనభూజమునీడ నిల్చి దంభం బమరన్. 70

సీ. అర్ధచంద్రుని తేట నవఘళించులలాట
పట్టిఁదీర్చిన గంగ మట్టితోడ
జెక్కుటద్దములందు జిగి వెల్లువలు చిందు
రమణీయ మణికుండలములతోడ
పసిడిగ్రాత చెఱుంగు మిసిమిఁదోపఁ జెలంగు
నరుణాంశుకోత్తరీయంబుతోడ
సరిలేని రాకట్టు జాలువా మొలకట్టు
బెడఁగారు నీర్కావి పింజెతోడ

గీ. ధవళధవళములగు జన్నిదములతోడఁ
గాశికాముద్ర యిడిన యుంగరముతోడ
శాంతిరసమొల్కు బ్రహ్మతేజంబుతోడ
బ్రవరుఁ డయ్యె వియచ్చరప్రవరుఁ డపుఁడు. 71

క. ఇట వవ్వరూథియుఁ నొ
క్కొటఁ గతిపయసఖులు దన్నుఁ గొలిచి నడువఁగాఁ
జటులఝుళంఝుళరవపద
కటకసమాకృష్ట కేళి కలహంసికయై. 72

సీ. ఊరగపూత్కారధూమోగ్రగంధముఁ బాసి
పొలయుఁబో యీతావి మలయపవను
డనలార్తు వెడబొబ్బ నలమిన తలఁదిమ్ము
పాయుఁబో యీతేంట్లపాట మరుఁడు
ఘర్మసామీప్య సంకలితదాహవ్యార్తి
నాగుఁబో యీనీడ నల్ల మఘుఁడు
గరళసౌందర్యార్తికర సుధాకటుకత్వ
ముడుపు బో యీతేనె నోషధీశుఁ

గీ. డనగఁ జంపక కురువక పనస తినిశ
నిచుల వంజుల దాడిమీ విచికిలామ్ర
పాటలీ పూగ కేసర ప్రముఖతరుల
సొబగు మీరు నుద్యానంబు జొచ్చి యచట. 73

మ. పవమాన ప్లవమాన పంకజరజః పాళీ పిశంగచ్ఛవీ
భవదభ్యర్ణ వికీర్ణ కృత్రిమసరిత్పాథస్తరంగాహతిం
దనపాషాణ వితర్ది కాతలమునన్ నాళీకపత్రాక్షు లు
త్సవ మొప్పన్ విహరించుచున్ సరసవాచాప్రౌఢిమ ల్మీరగన్. 74

చ. బటువయి విఱ్ఱవీఁగి పరిపాటిగఁ బూచి పరాగపుంజ మొ
క్కొటఁ గలయంగబర్వ గొన చెమ్మనుగోయిలమించనొప్పెఁ జెం
గటియెలమాని పారరుచి గందవొడిం గనుపట్టి నీలతా
స్ఫుటతరచూచుకం బగుచు బొల్చు వనేందిర గుబ్బచన్నునన్. 75

తే. వెలఁడి యిచ్చటి సంపెంగవిరులు గహన
దేవతల యిండ్ల నెత్తిన దీపశిఖలు
గాకయుండినఁ బంచబంగాళమగుచుఁ
బాఱునే మత్తమధుకర పటలతమము. 76

చ. అపరిమితానురాగసుమనోలసయై చిగురాకుఁ జేతులన్
తపసిని గౌగిలించె వనితా యిదె రంభ దలంప రంభ దా
నపరిమితానురాగసుమనోలసయై చిగురాకుఁ జేతులన్
తపసిని గౌగిలించు టుచితంబె కదా యన నవ్వె రంభయున్. 77

ఆ. కొమ్మ కన్నుఁగవ గోరగింపఁగఁ జూచి
తఱచు జొత్తుఁగప్పు దాసనంబు
గవియు నీలిమాల గహనాంధకారవి
తానమునకు నుదయభానుఁడయ్యె. 78

తే. శ్యామలోపరి నిబిడ పత్రాభ్రములకుఁ
గాండమండంబు దిగు వానకాల్వ గాఁగఁ
బంకరుహనేత్ర వర్షర్తు శంక నొసఁగు
పోఁకఁబోదియ నవకంపుమోకఁ గంటె. 79

ఉ. చూతమె దాని పక్వతర శుక్తిపుటాంతరదృశ్య మౌక్తిక
వ్రాతములై వెలుంగు గరువంపుఁగొటారుల నొప్పు తామ్రప
ర్ణీతటమట్లు జీర్ణదళ బృందసమావృతపాండురప్రసూ
నాతి మనోజ్ఞ మూలముల నర్థి నెసంగు మధూకసాలమున్. 80

క. పంకజముఖి విరహులపయి
గింకన్ నిజసైన్యకోటికిని సెలవిడు మీ
నాంకుని కరతలమన నల
కంకేళిం జిగురుగాలిఁ గదలెడు గంటె. 81

చ. నునుఁజిగురాకు మేయుతరి నోరికెలంకులఁ దేఁటి గుట్టినన్
వనతరుశాఖలం గుహుకుహుధ్వనిఁ బాఱుపికాంగనం బికం
బనునయ మొప్ప మూన్పుగతి నాత్మసుఖంబు ముఖంబుఁ జేర్చుచుం
బన మొనరించె సందుసుడి మాయలుగా మగవారి కృత్యముల్. 82

క. అని పొగడుచు నొయ్యారపు
టనువున జడలల్లి జిలుఁగు అగు పయ్యెదల
జనుపట్లు గట్టి గట్టిగ
ననిమిషకాంతలు లతాంత హరణోత్సుకలై 83

రగడ

నేర్పుమై నల్లయది సెఱులఁ దొలుపూఁ దుఱిమె
దర్పకున కర్పింప దఱఁప దెంతటి పెరిమె
యింతి పావురపురొద యేల విసె దారజము
వింతియే విరహిణుల వెతఁబెట్టు బేరజము

సరిరాదు దానికల శశిరయిడలు కప్పురము
పాళి కల్లదిపోకఁ బ్రాఁక బంధము దెగియె
నాళి యది దిగజారు నట్టిచందము నగియె
మలయపవనునిఁ బిలిచె మావి బళి యీకేళి
మలయు కోవెల పంచమస్వరం బను నీల
సులభమై దొరకె మంజులవాణి చంపకము
చిలుకవన్నెపుఁబొందలు చేరి యిఁక కంపనము
చనకుఁ డిఁక దవ్వునకు సఖులార పువ్వులకు
నగుచు నలరులు గోసి రతివ ల్లన డాని 84

౮. వాళికమధూత్తము
రాలి ముఖరాలి సుఖకరంబగు కోలనం
గేలి లాలసగతి డిగి
యాలి నివహంబు లోలలాడెడికేళన్ 85

ఉ. వాడిని మోయుఁదమ్మి తెలివాలిక కన్నులు విన్నఁబోకఁ గో
నాడక తెన్నొసల్ కరమునందిడి తీరవిషణ్ణయై జలం
బాడఁగఁ బిల్చువారి నొక హస్తపుఁ బ్రయత్నన వాడుఁదంచుఁ దాఁ
జాడక చూచుచూడ్కి నల జోటి దిశల్ పరికింప నొక్కచోన్

మాలిని. రవిరుచిఁ ద్రసరేణు వ్రాతముల్ మించువాత్యా
నివహనిహతిలో నిందిందిర శ్రేణు లాడం
గురలు ఘనవల్యా కూలవల్లివని సం
భరము లగుచు మింటం బర్వ పుష్పాళ్యలోవన్. 87

సీ. పసిడితోరమతోడి బాహువల్లరియెత్తి
సారెకుఁ బాదల్లపైఁ జాఁచి చాఁచి
బింబాధరంబు గంపింప నొయ్యారవిపం
చీస్వరంబునఁ జట సెప్పి సెప్పి
దిశలమార్గాన్వేషి దీర్ఘలోచనదీప్తి
గణముచేఁ దోరణ గట్టి కట్టి
కమనీయతమకాంతి కనకద్రవంబున
నారామరంగంబు నలికి యలికి

గీ. యానితంబవిలంబి కాలాహికల్ప
ఘనకచగ్రంధి నచటిభృంగముల కసిత
దీదితులు వడ్డికొసఁగుచు దేవపూజ
విరులుచిదిమెడి కపటభూసురునిఁ గనియె. 88

ఉ. కాంచి కలక్వణత్కనక కాంచికయై యెదురేగి యప్పుడ
క్కాంచన కేతకీకుసుమగాత్రి వయస్యల డించి తన్నికుం
జాంచలవీథిఁ దాఁటుచు ఘనాంతచలచ్చపలాకృతిం గలం
గాంచిన వస్తువుం దెలిసి కాంచినయట్లనురక్తిఁ గాంచుచున్. 89

ఉ. ఆకమలాక్షి యింపున దృగంచల మించుక మూసి హర్ష బా
ష్పాకులశోణకోణరుచు లగ్రమునం జనఁ జూచుచూపు లీ
రైకనుపట్టెఁ దమ్మురసమంటు కొనన్ వెడవింటివాఁడు శ్రో
ధైకధురీణతం గఱచి యేసినసింగిణి కోలయో యనన్. 90

సీ. తొలుదొల్త వానిఁ గన్నులఁ గాంచినప్పుడ
పల్లవాధరగుండె జల్లుమనియె
నట రెండుమూఁడంజ లరుగునప్పుడ కాళ్ళఁ
బంకజాక్షికిఁ దొట్రుపాటుగదిరె
డాయంగఁ జనునప్పుడ ముఖాంబుజంబునఁ
గంబుకంధరకు దైన్యంబుదోఁచెఁ
గదిసి నిల్చినయప్డ కనుఁదోయి ఱెప్పల
లలనకు మిగులఁ జంచలత బెరసె

గీ. గటకటా యనునపుడ గద్గదిక వొడమెఁ
జెఱఁగువట్టిన యపుడ చేఁజెమట గ్రమ్మె
సొలసి మాటాడ నంకింపఁ దలచి మోము
దేఱికొనిఁ జూచునపుడ కన్నీరువొడమె. 91

క. పాటితకరిదంతద్యుతి
పాటచ్చరగండఫలక భాగంబుల పైఁ
గాటుక కన్నీ రొలుకఁగ
మాటవెడలఁ గ్రేటుకొనుచు మానిని పలికెన్. 92

ఉ. ఏలర యీచలం బుడిగి యేలర బాలరసాలమాలతీ
జాలములో శశాంకకరజాలములో వలవంత నశ్రువుల్
జాలుగ వాల్గుజాలు నిఁకఁ జాలు భవం బనువంత కాఁకవం
బాలయి రాత్రి పంచశరు బారికిఁ జిక్కితి నీవ దక్కితిన్. 93

శా. రావైరాగ్యముఁ బూని నీవు కడు నిర్దాక్షిణ్యచిత్తంబునన్
రావై తేఁ జవిగాని యింగులకు హోరాహోరిగాఁ బోరి యే
లా వాలాయము సేయఁగా బ్రదుకు నీవాచారవంతుండవై
చావో యొక్కఁడొ నీయెడం బొడము వాంఛన్ భూసురగ్రామణీ 94

క. కట్టిడితనమున కిట్లాడి
గట్టి మనసు ఱాయిసేసి కరఁగవు మఱి నీ
పట్టినది విడువ విఁక ని
ట్టిట్టన వేళ మా యదృష్టం బుండన్. 95

వ. అనిన నక్కహనాభూసురకుమారుఁడు. 96

సీ. కొనసాగి కామినీ గోష్ఠిఁ బ్రౌఢములైన
యెదురుజూపుల ఱెప్పతుదుల నాఁచి
సంతసంబున ముఖాబ్జంబునఁ జిఱునవ్వు
కందళింపక యుండ డిందుపఱిచి
పొంగారుమైఁ దోఁచు శృంగారచేష్టల
తమిఁదెచ్చికోలు మాగ్ధ్యమున డాఁచి
పోరసు రసావేశమున వచ్చు నర్మోక్తు
లాదవి నాలుకవు రాకుండ గ్రుక్కి

గీ. మస్తకము వాంచి యెఱుఁగని మానముద్ర
నేల బొటవ్రేల వ్రాయుచు నిలిచి కొంత
సేపు పెడపెడ చింతించి శిర సొకింత
యెత్తి సన్నంపు టెలుఁగుతో నిట్టు లనియె. 97

శా. తల్లిం దండ్రియు నన్నుఁ గానని మనస్తాపంబునం బొక్కఁగా
నిల్లాలార్తిఁ గృశింపగా సవనవహ్నిశ్రేణి చల్లారఁగా
నిల్లున్ శూన్యతనొంది యింపు చెడఁగా నిచ్చోట నేఁ జిక్కియో
ఫుల్లాంభోరుహనేత్ర యేసుఖమతిన్ భోగించెదం జెప్పవే. 98

ఉ. ఓసరసీరుహాక్షి వినవో రతి గాఁగిట నీవు చేర్చు నిం
పౌసురభర్తకైనఁ గలదా వలదంచుఁ బెనంగ నేను స
న్న్యాసిని యొక్కఁడే తహతహ న్మనసాగ్రము కేళిపై వనా
శ్వాసితదుఃఖితే మాని సర్వ మసహ్య మనా నెఱుంగవే. 99

క. ఐనం గానిమ్ము భర
ద్దీనతకై వ్రతము విడిచితిం బరులకు మే
లైనం జాలు శరీరం
బైన నుపేక్షింపవలయు నది యట్లుండెన్. 100

క. తివురక యింకొక్కటి విను
కవయునెడన్ వలయుఁ గన్నుఁగవయును మూయన్
భువి నిది యస్మద్దేశ
వ్యవహారము కన్నుఁ దెఱవ నఘ మగు దెలివా. 101

శా. ఈ మర్యాదకు నీవొడంబడిన నే నీతంగి గాకేని మా
భూమిం జేరఁగ నెట్లు నీయుడిలితోఁ బోవంగ లేనే కదా
యీ మందాకినిపొంత నీ ఘనలతో నిర్వృత వాటంబులన్
భామా యేఁ దప మాచరింతు విధి కబ్రహ్మణ్యముం బెట్టుదున్. 102

తే. ఇంకనొక్కటివినుము పూర్ణేందువదన
వ్రతముచెడ సౌఖ్యమైనను వలయుఁ గలుగ
వాంఛితము దీర నను నీవు వదలఁ జెల్లఁ
దేను నిను సమ్మతిలఁ జేసి యేగుదనుక. 108

వ. ఇంతయేమిటికం జేసిని జెప్పెద నేను శైశవకండ. బంధు మిత్రకళత్రంబులం బాసి దైవయోగంబున నంతదూరం బేగుదెంచినవాఁడ మీఁద భవదర్థంబు ప్రార్థితుఁడనై వ్రతహోమాద్యనుష్ఠానంబులు విడువం గలవాఁడ నగుటఁ జేసి యంతరంగంబునం గల తెఱంగు తేటపడం బలుకవలసె నాకర్ణింపుము. 104

ఉ. నీచమదోయి పండువుగ నిర్భరవాసన మేను మాన న
య్యో! చరసౌఖ్యములు నెట యొండెఁ దపంబొనరించితాపసుల్
రాచుట యొండెఁ గాకిటఁ పరంబుల కూరక దూరమై వసు
శ్రీ చన రెంటికిం జెడిన రేవఁడ నౌదునె నీరజేక్షణా. 105

క. అని యూరు గలుగఁ బలికిన
విని తెలుపు మెఱిది మోము వికసిల్లంగాఁ
దనచేతి చెలఁగు చిలుకం
బెనచుచుఁ దలవాంచి నగవు బెరయఁగఁ బలికెన్. 106

శా. హా! నీనిష్ఠురవృత్తిమానికరుణా శాయత్తచిత్తంబునన్
మౌనం జాఱనటంచు నేఁడు శ్రవణానందంబుగాఁ బల్కుటన్
సూనాస్త్రున్ వెతవెట్ట కేలితి సుఖాగ్నోరాశిలోఁ గ్రుంకితిన్
నానోముల్ ఫలియించె నా వయసు ధన్యంబయ్యె విప్రోత్తమా. 107

వ. నీ విట్లు చెప్పి తట్టు నీయంగలదాన నని యతని నోడంబఱచు సమయంబునం దోడివచ్చెలు లచ్చకోరాక్షిం గూడకొని. 108

సీ. అకట నిర్దయబుద్ధి నగి దూఱెఁ గదుసంధ
యాహా! వివేకివౌదనియె హారిణి
చేఁగు భ్రమింగదరంచుఁ జలికినవ్వె ఘృతాచి
మాయలాడని తిట్టె మంజుఘోష
న్యాయనిష్ఠురములఁ బ్రార్థించె నూర్వశి
జంకించె రమ్యంచుఁ జంద్రరేఖ
కాఱితోఁచి తని దిసంతులుగొట్టె సుదక
విడువుమాయలటంచు నొడిచె సోమ
గీ. కొంటెవనియెఁ దిలోత్తమ కూర్మిఁ గొసరె
ధాన్యమాలిని పుంజికస్థలయదల్చె
దివిజకామిను లీరీతి దియగువాణి
సుక్యకోగ్లాందుఁ దయలోన నవ్వుకొంచు 109

క. అవరాంబాధూనుఁడు దప్పు
దాకాంతల సరసు సమ్మతాలాపములం
దైకొనుచు ముదితహృదయుం
డై కేళీవనము వెడలి యరిగి కుఱఁగటన్. 110

సీ. మృగనాభి నికరంపు బుగబుగల్ గలచోటఁ
జద లేటిటుంపురుల్ చెదరుచోట
కళికావాటిగంధవహుఁడు పైకొనుచోటఁ
గర్పూరకదళధూళిగప్పుచోట

బసమీఁదు సెలయేఱు లిసుక వెట్టినచోటఁ
చిగురుమావుల గంజ నిగుడుచోటఁ
నవమాలికలతీవె నట్లుగట్టిపడుచోట
మాణిక్యదీపముల్ మలయుచోట

గీ. బ్రమదమునఁ దేటు లెలుఁగెత్తి పాడుచోటఁ
శారిక లనంగశాస్త్రముల్ చదువుచోట
గీరకలకంఠములు బ్రొవ్వి కేరుచోట
బావురము లారజంబులు పలుకుచోట. 111

తే. అవరూధిని మణిమండితాలయంబుఁ
గాంచి యనురాగమునఁ బ్రవేశించి యంతి
వారి నిరువురఁగూర్చి యవ్వనజగంధు
లాత్మగృహముల కేఁగి రనంతరంబ. 112

క. ఫుల్లలవలీనవైలా
వల్లిమతల్లికలతోడ వాసంతిక లు
ద్వల్లీల నల్లిబిల్లిగ
నల్లికొనిన యొకలతాగృహాంతరసీమన్. 113

క. ఆగంధర్వకుమారుఁడు
నాగజగమనయుఁ బ్రఫుల్లహల్లకతల్పా
భోగంబున రహి మిగులఁగ
భోగింపందొడగి రాత్మఁ బొంగెడుకాంక్షన్. 114

వ. ఆసమయంబున. 115

సీ. సహసా నఖంపచ స్తనదత్తపరిరంభ
మామూలపరిచుంబితాధరోష్ఠ
మతిశయప్రేమకల్పిత దంతసంబాధ
మగణిత గ్లానిశయ్యానిపాత
మతివేలమణితయాచ్ఛాదకగల్లచపేట
మతిదీనవాక్సూచితాత్మవిరహ
మంకుర త్పులక జాలావిద్ధసర్వాంగ
మానందకృతహార వానసాజ్ఞ

గీ. మాక్రమక్షీణ మతివర్ణ నిమామీలి
తాత్క మాస్విన్నగండమాయత్తచేష్ట
మాస్థిమితభూషణారవ మావధూటి
ప్రథమ సురతంబు గంధర్వపతిఁ గరంచె 116

క. అన్నునఁ గనుమూయుట రొద
సన్నగిలుట కౌగిలింత సడలుట నేర్పుల్
సున్నగుట వరూథిని రతి
కన్నెఱికపురతియుఁ బోలెఁ గడునింపొసఁగన్. 117

క. ఈవిధమున నయ్యిరువురు
భావజతంత్రైకపరత బహుకాలము సౌ
ఖ్యావహలీలల నుండం
గా వేలుపుముద్దరాలు గర్భముఁ దాల్చెన్. 118

క. నడ జడనుపడియె నా రే
ర్పడియెం జనుమొనలు నల్లపడియెన్ వడియుం
బడియెఁ గడునొడలు పడఁతికి
బడలికయును నిదుర యరుచి బహుళంబయ్యెన్. 119

మ. పలుచంబాఱుటఁ గోమలస్మితరుచుల్ పైఁదోఁచె నాగౌరకాం
తుల గండద్వితయంబు పాల్చెఁ బ్రమదార్ణోరాశిఖేలన్నవో
త్కలికాభంగ పరంపరోపరి సముద్యత్పాండు డిండీరపం
క్తులు నాఁ జిట్టుము లుల్లసిల్లెఁ దఱుచై తోడ్తోఁ గురంగాక్షికిన్. 120

తే. నాకజలజాక్షి నిఱుపేద నడుము బలిసి
యల్లనల్లన వళిసీమ నాక్రమించెఁ
బేర్చి దివసక్రమంబున బీదబలిసి
బందికాఁడైనఁ బోరువులు బ్రతుకఁ గనునె. 121

క. పాటలసుగంధిపాటలు
నాటలు లేకప్పు డొప్పె నలసతఁ బధికో
త్పాటనజయపరికాంత
జ్యాటంకృతిచలన మదనచాపముఁ బోలెన్. 122

సీ. మనసుకక్కుఱితీతి మెల్లన లేచి చేతులఁ
గాంతుని జబ్బుగాఁ గౌఁగలించు
నలసత మృద్గంధియైన, కమ్మనినోర
నధరంబు నెడనెడ నాని కూర్కు
మణితాదిపపనధారణశక్తి చాలమి
నొయ్యన నర్మోక్తి నుబ్బొనర్పఁ
గాంక్షితక్రీడ కంగము పంపుసేయమి
నొడ్డుగా నిట్టూర్పు లొలయఁబొగులు
గీ. నిచ్చయొఱేఁగిన రతికేళి మెచ్చి పొగడు
నప్సరఃకాంత రతి పరిహాసవేళ
జీవితేశు సమేళంపుఁజేత లుడుపు
బ్రార్థనాపూర్వదీనసంభాషణముల. 123

క. అంత వియచ్చరుఁ డభిమత
మంతయు సమకూరుటయును నచ్చరగర్భ
శ్రాంత యగుటయును గనుఁగొని
యింతట నిచ్చోటు వాయ కే నిఁక నున్నన్. 124

క. వంచన యొఱేఁగిన మఱి శపి
యించునొ సురకాంత చెప్ప కేఁగిన బ్రేమన్
పంచశర శర పరంపరఁ
బంచత బ్రాపించి మీఁదఁ బాపం బిడునో. 125

వ. అని వితర్కించి యక్కపటవిప్రుం డెఱిఁగించి యనిపించుకొనియు పోవువాఁడై
యప్పు డప్పూవ్వుబోఁడి డాయంబోయి బుజ్జవం బొప్ప నిట్లనియె. 126

తే. ఎవ్వఁడేఁ బాదలేప మెక్కింత నాదు
పాదముల బూయ నింతేని పనులుపుట్టె
నమ్మహాయోగి బహుయోజ నాధ్వగామి
యీగిరికి నేఁగుదెంచె నేఁడేఁగి కంటి. 127

క. అతఁడు మఱితీర్థయాత్ర
వ్రతవశమున వచ్చి మాపురంబు తెరువుగా
గతలుగ మాసంసార
స్థితులెల్లను జెప్పె నేమి సెప్పుదు నబలా. 128

సీ. పైపరామరిక చొప్పడమి బక్వముఁదప్పి
పండఁబాఱిన పొల మెండఁబాఱెఁ
గట్టఁ గాపింప దక్షత లేమి నూరూర
బందులఁ బడిపోయెఁ బశుగణంబు
పంచనామతిఁ బ్రాడ్వివాకులై వటువు లా
జ్జల కొప్పగించిరి చదువులెల్ల
గిఱరించి రిచ్చి పుచ్చుకొనుచోటులవార
లాకఱ లోనుగా కప్పు లీఁక

గీ. గ్రహణసంక్రమణాదుల రాచనగరఁ
గాసువీసంబు వెడలమి గ్రాసమునకు
నాధి వెట్టిరి క్షేత్రంబులందుఁ గొన్ని
లెస్సయుండునె గృహకర్త లేని బ్రదుకు. 129

క. అదిగాకే నిట వచ్చిన
యది మొదలుగఁ జింతచేఁ న హర్నిశమును నా
కెదు రెదురె చూచు బిడ్డలు
ముదుసళ్లును పుత్రమోహమున నగు న్నార్తిన్. 130

క. తడిగంట నెపుడు దఱుఁగక
కడిదఱుఁగఁగవడియుఁ దరిగిఁ గాసిం బుడమిం
బడిన గజరాక మంచపుఁ
దొడుగఱలై రట్టె రుజలతో నేమంగున్. 131

క. కావున వారలఁ జూడం
గా వేగమ చనఁగవలయుఁ గమలదళాక్షి
నీవెఱుగని ధర్మాధ
ర్మావస్థితి గలదె దీనికై యడలకుమీ. 132

క. వడిఁ గాచికాఁలియుండం
కడవల నీ రినుముఁ ద్రావుకై వడిఁ బైఁబై
బొడ మెడు కోర్కులచేఁ బె
ల్లుడికిన మది భోగముక్తికి కూఱట గనునే. 133

ఉ. కావున నెన్నఁడుం దగని కాంతు నెపం బొకఁ డెన్ని రోసి నేఁ
బోవఁదలంతు నేని వలవు న్ననుపుం దగవుం బ్రియంబునన్
నీవలనన్ సమగ్రములు నిల్చిన సంపెఁగపువ్వుదేనె త్రో
త్తావికిఁ దేఁటి చిక్కినవిధంబునఁ జిక్కెనె లోలలోచనా. 134

ఉ. ఎవ్వఁడు మీఁదెఱుంగక యథేచ్ఛ సుఖైకరతిం జరింపఁగా
నవ్వల వంశహాని వ్రతహాని యశోధనహాని పుట్టుఁ దా
నవ్వెడఁ గమ్మవ్యసను వస్తువివేకి చెడున్ జగంబునన్
నవ్వఁగఁ బాలు రౌరవమునం బడఁబాలును నిందపాలునై 135

మ. అనినం జిత్తము జల్లనన్ సొరుగు నయ్యంభోజపత్రాక్షి లో
చనగోళంబులఁ జిమ్మలై చిలుపలై జాలై తరంగంబులై
చనుదోయిం గొనబౌ కురంగమదచర్చల్ జారిపో నొక్కమెం
డున బాష్పాంబు ఝరంబు లుప్పతిలెఁ బోటుంబాటుగా నెంతయున్. 136

క. అత్తరి గంధర్వవిభుం
డత్తామరసాక్షివదన మక్కునఁ గృపతో
నొత్తి మొగమెత్తి యశ్రులు
మెత్తనఁగొనగోరఁ బాఱమీటుచుఁ బలికెన్. 137

శా. ధీరస్వాంతవు వంత నీకుఁ దగునే దివ్యాంగనల్ కోవిదల్
గారే యోగ వియోగముల్ సతములే కర్తవ్యముల్ సేయకే
పోరే రారె ప్రియంబు గల్గిన జనుల్ పోరామి పోఁబోవునే
పో రాకుండఁగ నేమి కాళ్ళు దగనే ఫుల్లాంబుజాతేక్షణా. 138

తే. మూలమట్టుగఁ దెల్పె నమ్మునివరుండు
ప్రార్థితుండయి నాకు నప్పరమవిద్య
వచ్చుచును బోవుచుండెద వదల నిన్ను
శుకకలాలాప నన్నుఁ ద్రిశుద్ధి నమ్ము. 139

తే. అని వరూధిని నూరార్చి యచటువాసి
బోయెఁ దనయిచ్ఛ గంధర్వపుంగవుండు
తప్పరాదు ఋణానుబంధంబు దగినఁ
బ్రాణపదమైన వలపును బాసి చనదె.

వ. అనుటయుం దయవాతి వృత్తాంతంబు కృపాయత్తంబగు చిత్తంబగు చిత్తంబున నానతియ్య వలయునని యడుగుటయును. 141

శా. హిందూరాజ్య రమాధురంధర భుజాహిగ్రామణీ కంచుక
తుంగ స్వచ్ఛ యశోగుళుచ్ఛ యవన క్షోణీధవస్థాపనా
ఖుంది భూత కృపాకటాక్ష యసకృన్మాద్యత్కళింగాంగనా
బందీగ్రాహవిగాహితోత్తర కకుబ్ధాటీసమాటీకనా. 142

క. తిరుమలదేవీచరణో
దరలాక్షాకల్పకల్పితస్థలకమల
స్ఫురదిందీవరబంధుర,
హరి హయ మణివళయ కూట హర్మ్యవిహారీ. 143

ఉత్సాహ

వర్ణనీయ కీర్తివైభవా! ప్రభూత భూతదృ
క్కర్ణకుండలా! వితీర్ణకర్ణ! దీర్ణహృద్భ్రమ
దుర్ణయారి మానహారి! దుర్భరావశార్భటీ
ఘూర్ణమాన కొండపల్లి కొండవీటిమండలా. 144

ఇది శ్రీ మదాంధ్ర కవితాపితామహ సర్వతోముఖాంక పంకజాక్ష
పాదాంబుజాధీన మానసేందిందిర నందవరపుర వంశోత్తంస
శఠకోపతాపస ప్రసాదాసాదిత చతుర్విధకవితామతల్లి
అల్లసాని చొక్కయామాత్యపుత్ర పెద్దనార్య
ప్రణీతంబయిన స్వారోచిష మను సంభవం
బను మహాప్రబంధమునందుఁ
తృతీయాశ్వాసము
సంపూర్ణము

—*—



శ్రీ

స్వారోచిష

# మనుచరిత్రము



* * *

## చతుర్థాశ్వాసము

శ్రీకృష్ణరాయ గుణ
రత్నాకల్పా ! కల్పకద్రుమాధికదాన
శ్రీకుతుకాగతలోకా
లోకాంతర సకల సుకవి లోకస్తుత్యా. 1

వ. అవధరింపుము. జైమినీ మునీంద్రునకుఁ బంగపుంగవంబు లిట్లనియె. 2

సీ. మున్ను విప్రాకారమునఁ గూడుచో శంకఁ
గనుమూయఁబనిచె నా ఖచరభర్త
యవ్వరారోహయు నాసక్తకావునఁ
నిచ్చలో నటుసేయ నియ్యకొనియె
నా ప్రతిజ్ఞాపూర్తియయ్యెఁ దసంత న
వ్వనితకు రతి పారవశ్యపటిమ
నపుడు తత్ప్రవర దేహసమిద్ధశిఖిదీప్తి
కాంబరీమహిమచే సంగ్రహించి

గీ. నట్టి గంధర్వమూర్తి సౌఖ్యానుభూతి
జలన మేదినమానసాబ్జమున నిలువ
వెలసెఁ దేజోమయం బైన వృద్ధి నట్టి
మేటిగర్భంబు నెలలు తొమ్మిదియు నిండె. 3

వ. అనంతరంబ యొకానొక పుణ్యదివసంబున. 4

శా. తేజం బబ్జభవాండ గేహమునఁ దీపాంకురచ్ఛాయమై
రాజిల్లన్ గ్రహపంచకంబు రవిఁ జేరం బోని లగ్నంబునన్
రాజీవాక్షికుమారుఁ గాంచె సుమనోరాజన్యమాన్యున్ జనుల్
జేజే వెట్టఁ బ్రసూనవర్ష మమరశ్రేణుల్ ప్రవర్షింపఁగన్. 5

క. స్వరుచిస్ఫురణను శశిభా
స్కర పావక తారకాప్రకాశము లెల్లన్
విరళములు సేయుఁ నితనికి
స్వరోచి యను నామ మిడి రచటి మును లెల్లన్. 6

చ. మఱియు నతండు సంయమి సమాజ వినిర్మిత జాతకర్ముఁడై
నెఱిఁ బరివర్ధితుండు నుపనీతుఁడు నై వివిధాయుధంబులన్
గఱకరియై రణస్థలుల గద్దరియై నిగమార్థవేదియై
నెఱతనకాఁడు నై మెరసె నిర్మలకాంతివిలాసరేఖలన్. 7

—స్రగ్ధర—

గ్రుద్దు న్గోత్రాచలంబు ల్గులగులలయి పో, గోతము ల్గ్రిద్దులీలన్
ఖిద్దిం జెండాడు మ్రాఁకల్ కవుగిటి కొండుల్ కత్తినొక్కొక్క ఘాతం
బ్రోద్దామప్రౌఢి వాతాద్భుతగతిఁ బరచున్, భూమిజవ్వాడఁ గాని
ట్లద్దేవీనందనుం డత్యనుపమబలుఁడై. యౌవనారంభవేళన్. 8

క. వేదండము తొండము సరి
కోదండముఁ దివియుఁ నెడమఁగుడి నిబిడజ్యా
నాదము రోదసి నిండఁగ
భేదించున్ గండశిలలఁ బృథుబాణములన్. 9

క. అతఁడు మఱి తనకు మంథ
క్షితిభృత్తటి విశ్వకర్మ చేసిన నగరిన్
వితతాటవికచమూసే
వితుఁడై సామ్రాజ్య మనుభవింప నొకతఱిన్. 10

క. కరకాచిటపటరవభీ
కరమై పెళపెళనినాద ఘనమై ఝుంఝూ
మరుదుజ్ఝితబిలమంద్ర
స్వరమై యకాండ నొక్కవర్షము గురిసెన్. 11

క. తెల తెల వేఁగిన నగ్గిరి
జలజలఁ బ్రవహించు సెలల చప్పుళ్లు శిఖా
వళపలకల కేకాకల
కలములు గలతిలపొలంబు గనుఁగొను వేడ్కన్. 12

ఆ. అన్న గాగ్రమెక్కి యందొక్క శశికాంత
వేదిఁగతిపయాప్తవేష్టితుండుఁ
గుటజవిపినపవన నటదలకభరుఁడు
నగుచుఁ బ్రొద్దు జరపు నవసరమున 13

ఆ. ఒక్కయెఱుకుతేఁడు నక్కకొమ్మును నిఱ్ఱి
గోరజంబు జున్ను జాఱిపప్పు
బీలిగఱులయంప కోలలు సెలవిండ్లు
గాను కిచ్చి కరయుగంబు మొగిచి. 14

వ. యుగవిగమసమయ సముద్భూతజీమూత పటలంబునుం బోలెఁ గైలాసగిరి తంబ ప్రాంతకాంతార పర్యంతంబు నిరంతర బైకాఱుకొన్నయొక్కగహన రేఖం గరాంగుళిం జూపి భూపతి కిట్లనియె. 15

క. అల్లది కంటె పొనపొన
దల్లనిగట్లుఱుత మబ్బుదేఱెడు పొల మం
దల్లెడఁ జూచిన ధరణీ
వల్లభ! శ్రీరామసేన వాలుమెకంబుల్. 16

సీ. కండూతికై రాయఁ గర్కశం బగుతుంటిఁ
బీఁటవెట్టినమ్రాను వెల్లగిల్ల
జెవి దార్చి విని చీమ చిటుకన్న నొకసారి
సెలవి వెంపరలాడు జిట్టలెల్ల
జప్పరించు వెదుళ్ళ సటలుబ్బ దంష్ట్రాగ్ని
చాంగపై బడి చుంయిచుంయిమనగ
జంద్రనిప్పులువోలెఁ దీంద్రించుకనుమించు
లెసఁగనొండొంటిపై సెక్కఁబొఱు

గీ. పెట్టడినముల మడుగుల మట్టికలఁప
బుడబుడ ధ్వని వెడలు బుద్బుదములందు

జిలుప చిలుపని సేతులు జిడ్డుదేఱు
నేమిచెప్పదుఁ గ్రొవ్విన యేకలములు. 17

చ. బలమిఁక నేమి సెప్పవిను పందువెదు ళ్ళవలీలమోరత్రో
పులఁ బడఁజొప్ప వంచికొను పోలిక వంచి తదగ్రధాన్యముల్
సెలవుల ఫేనముట్టిపడ జిట్టలతోడనె చప్పరించు న
ప్పొలము వరహాపోతములు భూవరతొండములేని యేనుగుల్. 18

క. దోడిచిన కైదువునకుఁ జము,
రిడఁ గావల దగ్గిఱాఁక యించుక యిడినం
జెడుగఱ్ఱ గ్రుచ్చిన నం
జూడు మంటలఁ దగిలి నెయ్యి బొటబొట వడియున్. 19

తే. వఱదు పక్కల విడువంగ వలవ దేయ
నడిచి మొలపిడియమ్మునఁబొడువవచ్చు
బంకమున గొరిజ దిగఁబడఁ బలువలేవు
మన్ను లివ్వేళ రేగటి మన్నులందు. 20

క. పొడ చెదరి బోదచరచిన
యొడళ్ళతో నాల్లు రెండు నొకటియుఁ బ్రంగల్
వెడలిన కొమ్ములబరువున
నడుగిడఁ గాలేవు బలిసి యందలి దుప్పుల్. 21

ఆ. చలము లొందవ ముండ్లు గల ప్రాఁకుదీపములఁ
గరలితాఁకికొమ్ములురులఁ దగిలి
వాని లేవ నీడ్చి కానకే కొనుపోవుఁ
బోతరించి యిఱ్ఱిపోతు లచట. 22

ఆ. కప్పువెట్టి పెన్ను కందమ్ము సమముగాఁ
బొదలి జోళ్లుగట్టి పోరుచుండి
మలయుఁగాని పోవు మానిసిఁ బొడఁగన్న
సేమిచెప్ప వాని యీసు అధిప. 23

క. కట్టియఁ జేకొని దేగం,
బట్టి యుబుసుపోకఁ బాలము మట్టిన జాలున్
దాట్టిన క్రొవ్వులు గలయవి
చెట్టడచినఁ జేటఁ దేమి చెప్పం బులుఁగుల్. 24

తే. ఉడుముఁగరిమిడికొక్కుఁదండడియు వెల్ల
యెలుకకల్లెల్కఁ దఱచును నేమి చెప్ప
నడవి నెల్లెడఁ జూచిన నవనినాథ
జల్లెడయుఁ బోలెఁ లాఁగల నుల్లసిల్లు. 25

క. అనుటయు మృగయాకౌతుక
మునఁ జిత్తము చెంగలింప భూధరశృంగం
బుననుండి డిగ్గి నగరికి
ననిమిషకాంతాకుమారుఁడరగి రయమునన్. 26

వ. నగరు సొచ్చి యచ్చటం గక్ష్యాంతరశాలాంతరాళంబుల నందంద తండతండంబులై క్రేలు నత్తెంబులం జము రంటు పలలకండంబుల మండితంబు లగు నిడుదవెదురుదండెంబుల బర్హి బర్హానిబద్ధాగ్రంబులై కొమరారు దోరపుఁద్రాళ్ళతోడం దిరుగుడుల వడంగువడి వడిదప్పనట్లు తాళ్ళంగట్టు వడి పొట్ట లదురంగ నిక్కు పరిసెనంబులు వేయునవియును, నపహసిత శార్దూలకుటిల నఖకోటి పాటవంబులగు త్రోటిపుటంబులం జటక సరటాది జంతుకళేబరంబులం జరణనఖరాంకురంబుల నత్రికి చీఱుచుం గేరునవియును, నాఁడు నాఁటికిం బాటించి. వేఁటగాం డ్రదనెఱింగి మేపుమేపులచమత్కారంబుల నిరాకరించి పీకునం దిరిగి దిరిగి యాఁక దీర్చుకొనునవియును, బద నగ్గలించి కూయుచుం గడుపు నకనకంజడం గనుకట్టుతోడ మోములు మలంచుచుఁ బంజరస్థితి కీరశారికాపారావతాదులపలుకు లాకర్ణించి యెగసి యెగసి నిజావస్థితతాదృగ్విధాధార వేణుయష్టులకుఁ జిట్టుపలుచెదరం బ్రదక్షిణ భ్రమణంబులం బరిభ్రమించి మగుడ నెట్టకేలకు మట్టుకొనునవియును, మేరమీఱం దిన్నయెరల నన్నుకొని యరగన్నువెట్టి బోరకడంబొటమరింపం గూరుకుచుం గుతికిలంబడునవియును నై పఱఁగు పలుదెఱంగుల డేగ మొత్తంబులను గుత్తంబులగు మిగుల మెత్తని జలపోత తోలుపట్టెడలు మెడల సమరం బసుపార్చి కట్టుగంబంబులకుం దార్చి బంధించిన కుందనంబు గొలుసులు గల్లుగల్లుమనంగ నొడళ్ళు జాడించుకొనుచుం గొనసాగి సోగలై ముంగిసమోరలు బోనిమోరలు సారెసారెకు నెత్తి బయలు పసిపట్టుచుఁ గట్టెదుట వాజిశాలలం గట్టినపొట్టేళ్ళకై యాదికొనిసీల్గిశాలుద్రవ్వి ఘునఘున నాఘునఘుర్ఘురధ్వాన సముద్ధ్వానులు చెలంగ మ్రోఁగుచు నింగిఁ బ్రాఁకుచు నింగలంబు లుమియు నయనగోళంబుల నాభీలంబులై వివృతవదనగహ్వరవిలంబ

జిహ్వా పల్లవంబులకుం గ్రూరతర దంతకోణ కాంతికలాపంబులం గోరక స్తబకయోగంబు గల్పించుచు నల్పేతర గ్రస్తకీలాలపలలజాతాగ్రాసంబులు వెన్నడుముసన్నఁదనంబున నట మిగులడిగ్గి చన ఘనికిం గటితటంబులకంటె దారె పుటపుట నయ్యోనవం దోరంబులగు బోరల గందంబుల నందంబులు గని బిరుదు లంకించి తమ్ము నుపలాలించి పరిపాలకులసంస్తవంబులకుం జెవి దార్చెననం గర్ణకిసలయంబులు వ్రాలంబడి వెండిగుండులుం బోలెఁ గన్ను పండువులై గండభైరవు పూజావారంబులన మెండు కొనియుండు జాగిలంబులునుం గాంచి యందు నందును వేఁటకు నుబ్బైనవాని నేర్పతించి తెచ్చుటకు ననుచరుల నీవు నీవని నియమించి తానును నాఖేటకోచితపరపాటి సన్నద్ధుండయ్యె నయ్యవసరంబున. 27

సీ. పచ్చనిహురుముంజి పనివాగె పక్కెర
పారసిపల్లంబు పట్టమయము
రాణ నొప్పారుపైఠాణంబు సింగిణి
తళుకులకోరుల తరకసంబు
మహిపసిండిపరుంజు మొహదా కెలంకుల
తావుగుజ్జరిసేత క్రేవడంబు
డాకెలంకున సిరాజీకరాచురకత్తి
కుఱుఁగటఁ గ్రొవ్వాడి గొరకలపాది

గీ. పీలికుంచెతలాటంబు బేరజంబు
మణులు మొగముట్టు వన్నె సాహిణి యొకండు
కర్తయెదుటికిఁ గొనివచ్చె గంధవాహ
బాంధవం బగునొక మహాసైంధవంబు. 28

క. తెచ్చుటయు నిచ్చ మెచ్చిమ
రుచ్చటులతరంగరయనిరోధిస్యదగ
ర్వోచ్చంబగు నత్తేజి సు
హృచ్చక్రం బలర వేగ యెక్కి వెడలినన్. 29

చ. జడలు మలంచి చొల్లెముగ సన్నపుఁబాగ లడంగఁ జుట్టి చ
ల్లడములు పూని మీఁదఁ బదిలంబుగఁ గట్టిన మట్టికాసెలం
బిడియములంటఁ దోపి పృథుభీషణబాహులసాళుకంబులన్
దడవి కెరల్చుచుం జనిరి నాథునిమ్రోల నృపాలనందనున్ 30

సీ. ఇవి కంఠపాశంబు లింతడున్ననమీఁద
బడి దిశాకరికైన గెడపఁజాలు
నివి మింటఁ బఱచు పక్షీంద్రుఁ జూపిననీడ
బడివాలునం దాఁక బఱవఁజాలు
నివి గాలి కనినమూఁక వరాహదనుజేంద్రు
నైన జుట్టెంటిలో నాఁగఁజాలు
నివి కాటుకొల్పిన వృద్ధకూర్మమువీఁపు,
జిక్కైన నెఱచిక్కై చింపఁజాలు

గీ. ననఁగ ఘుర్ఘురగళ గర్తజనిత భూరి
భూభృదురుబిలభరిత ఘోఘో భయంకర
రార్భటీదీర్ణ దిగ్భిత్తులగుచుఁ జెలగఁ
సరిపెణలఁ బట్టి తెచ్చిన జాగిలములు. 31

చ. పులియఁడు బూచిగాఁ డసురపోతులరా జనుమంతిగాడు చెం
గలువ సివంగి భైరవుఁడు కత్తెర సంపఁగి వెండిగుండు మ
ల్లెలగుడి వాయువేగి చిటి శింగడు సాల్వడు వత్సనాభి యే
కలముల మిత్తి గబ్బియనఁ గాఁగిలవాని గ్రహించి యుద్ధతిన్. 32

ఉ. కట్టిగ నీలిదిండ్లు సెలకట్టియవిండ్లును విండ్ల గోసెనల్
చుట్టినొసళ్ళపై నిడిన జుంజుఱుబల్లసిగల్ గటీతటిన్
బెట్టిన యోటకత్తులును మేనుల గార్కొనుకప్పు లేర్చి చేఁ
బట్టిన వేఁటయమ్ములును బాగగువాగురికుల్ మహోధ్వనిన్. 33

సీ. సట లెత్తుకొని యొత్తుకిటియైన మోటస
వడియేయఁ బోడుతు నీపాదమాన
కలగుండువడఁ జెండు, కరియైన జెవిపట్టి
బలిమిమై బెత్తు నీపాదమాన
సెలసెప్ప కొనిరొప్పు పులియైనఁ బీడించి
పడవైతుఁ జొచ్చి నీపాదమాన
తెరదూఁటి కెరఁబోఱు గురుపోతు పైనైనఁ
బడియెక్కి పొడుతు నీపాదమాన

గీ. ఇతరదుర్బలమృగపంక్తు లేమి లెక్క
కండగరువంపుమాటలు గావుసుమ్ము
చూడు మమ్మని పంతంబు లాడుకొనుచు
నశ్వరూఢినిసుతుఁ గొల్చి యరిగిరపుడు.

ఆ. ముష్వగ దల నత్తెములనుండి యెగురుచుఁ
బదనుమీఱ నెరల వెదకు డేగ
పదువు కట్టిదండపాణులై నడచిరి
విభుని గాడలు డేగ వేటగాండ్రు. 35

ఆ. గూనివీపు లదర గొణిగితిట్టుచు నేమిఁ
గఱచినట్టికుక్క గండ్లనంగ
మూతి నరపమీసముల బోయముదుసళ్ళు
పందివలలు మోచి పఱచి రపుడు. 39

వ. ఇట్లరిగి యమ్మహారణ్యంబు సొచ్చి విచ్చలవిడి నచ్చటం బచ్చికబయళ్ళ మచ్చిక లచ్చుపడం దటిచ్చటులంబగు లోచన ప్రభాపటలంబు దిక్తటంబులం బర్వ తారుమాఱుపడ నిడికొనిన మొగంబులతో వేణీజిహ్వాపల్లవోల్లిహ్యమానాంగంబు లగు సారంగంబుల ఖురళీకారంగంబు లనంగనుపట్టు చెలికపట్టులును బిట్టెసంగునాకటం దట్టువడి పొట్టకై పుట్టకూటికిం జీమలకుం జౌరలునకుం నెలుంగులు గుఱ గుఱంబుట్టలు నిశితనిజనఖదళలిశ గోటులం గోరాడ నాదండ గాచుకొనియుండి నెడలిచను విషవిష్ఫురద్భుజగంబుల నల్గడిం గబళించి గెంటకుండ దంటు చప్పరించుగతిం జప్పరించుచు నొండొంటికిం బేరెంబులు వాఱిపప్పించి తప్పించుకొను దుప్పుల ఖురజరజర్ఝటలనెసక మెసంగు మసమసకల మఱుగుపడియుండు గండోపలంబులును పరిహసితసితేతరలపాషాణపాటవంబులగు విషాణ పరిఘంబు లొండొటికిం దాకి పెతిలు పెత్లు మనంబోరు కారుపోతుల కోలాహలంబులం బ్రబలశబ్దంబు లీనుకోనలును షడమొదవ సెదపదనునం బొదలు పెట్టలకుంజొట్టంబులై చిల్లరపలుగులం బిల్లలం జొల్లరంబుల సాగనిచ్చి గమికి వెనుకయై మలయుచుం బిఱుందం దిరుగు చిరుగున్నలకు వెన్నాడు తోడేళ్ళ నివంగులం దిరిగి తిరిగి మొత్తి పోనెత్తి చరియించు నేకచరంబుల ఘుర్ఘురధ్వానంబుల ఘూర్ణమానంబులగు పరిగె పక్కెపలు మేడి రేగు వేము పులుగుడు గురివెంద యూదుఁ గేలంగి మోదు గౌరు కోరింద కరుమా కారుగు మొదలగు పొదలం

బోడువగు నానావిపినపాదప కలాపంబులును మాటిమాటికి మానిసికాఱు
మఱుఁగి తెరవులు కాచి కాచి డగ్గుత్తికవడందిను పెద్దపొలవలనం బుటపుటనై
త్రుప్పాళ్ళు డుల్లి ప్రళ్ళిగంతులిడు గబ్బిబెబ్బులులం నలఁబెడుల దొడ్డజనం
బులు మంత్రించి పెరకదిగిన నీరుమేపు డిగి గిరులు క్రక్కుదల వాపోపుచుం
దిరిగి తిరిగి వాకట్టు విడిచినప్పుడు దప్పికై పాఱి సెలయేటిచెంతలం బాఱి
మ్ములు ఱొమ్ము కెలంకులం గాడ గాంద్రు గాంద్రుమని రొప్పినొప్పి కప్ప
రంబుగా వియత్తలంబునకు పెల్లెత్తుపాడవు సెగని సెత్తురులు గ్రక్కుచుఁ
గూలుక్రోల్పులుఱ ఘుర్ఘురధ్వనుల గుండియలవిసి కలగుండువడు కారండవం
బుల పక్షపుట పటాత్కారంబుం బోరుకలంగు సెలయేటి తెంకలును
మేఁతవెంబడిం బాలముపల్లంబులం దిరిగి తిరిగి పెంట్రికలువెట్టు, పంటపట్టు
నకువచ్చి యచ్చటం గ్రుచ్చి కానరాకుండు మునుమున్న మృగయుండు బిస
యొడ్డి సంఘటించిన కాలిబోసులం బడి బెగడక యద్దారు వీడ్చికొని యీర
ములఁ దఱియుంబడి యవ్వలికై వెడలిచనలేక గడచి తన్నుకొను మన్నుమే
కంబుల యాక్రందనంబులం గ్రందుకొను విషమప్రదేశంబులును జిఱుతగండ్ల
గమిచేతదైవికంబున డాప్రక్కమీఁదు వడ దాటువడియవి గొంతు క్రొన్నె
త్తురు క్రోలి విడిచి చన మార్మ్రడలు పడి మశకవన దంశమ్ములు మూఁగ
మాగంబాఱిన కొండగొఱియ ముఱుగుడు బొందులకు సందడించు గశంకృ
ద్ధావళుల మొల్లంబుల ముసుంగుపడు పల్లంబులును మేయుఁతఱి వీఁపెక్కు
టేఁచొకటి మూపురంబు కరచి కరచి యొఱచి పడవైవ దోడి యొక రెండు
మూడు వెనుకముందఱ నందంద గాళ్ళం బెనఁగుచు దత్తునక శేష్ఠియేఱి
తిన్నగా వెడలిన యెడముందు తద్వేదనకుం గాన మట్టలెత్తుకొని యెత్తుగల
పొదరుటడవులు చొరంబారు పిడికడితి కగుపునరవడికి విఱిగిపడిన విటపి
విటపంబులఁ దగుకు పొడిచిన గతినొండు నెడలును బదులు పదులు నూఱులు
నూఱులు వేలు వేలుగుములుగట్టిదట్టంబగు నెయ్యంబున నెదురు బియ్యంబు లొం
డొంటికొసంగ గరివరకరేణువులు వంపముంపు చెడి యిట్టట్టు తిట్టలగుజిట్టల
సంకటంబులగు డొంకలు నీక్షించి హర్షించి యెక్కుడుఁదమి నొక్కయెడ
నడుగవెడలని టెంకిఁగని వాఱుగవులునకు మెకము దిగదని యెన్నిమన్ను
దూర్పత్తించిగాలి పరికించి దిగువదెస దొడ్డివలపన్ని యెగువ పొలిమేరబారా
దియగు దూరంబేఁగ బోగువాఱించి యత్రాణ వలమోవం దెరలెత్తి యెత్తి
నతెరఁ దుత్తుమురుగా, జించుకొని పాఱినం బోసిక బారి సమరుటకు వల
చుట్టునుం జెట్టు దండగొని నిలువ నలువుగల పుళిందులఁగొందఱనిలిపి

యమ్మందపిఱుంద జాగిలంబుల తోడ వాగురికుల నిలువ నియమించి తెరవు లోనగు వానినందుఁ బడంగొట్టించియుఁ గట్టువెంట దట్టంబుగాఁ బ్రజ నెక్కించి మఱి కలయ గహనతలంబున నెల్లం బెల్లుగా విల్లువేఁటకు నేటుదప్పని మేటివిలుకాండ్ర మృగములు వెలువడుటకు హరిచ్ఛదచ్ఛటావృతశిరఃకటిధనుష్కోటులై కొట్టుకానిం జూపెట్టుకొని యెదురుమాలులు గాఱుండ నుండి చెదరి పారదెరువులం బఱవకుండ నీరముల సందుసందులం దమతమ కట్టిన మోటకత్తుల నొండొండ ఖండితంబులగుమండగల కంపమండలు ద్రోచి మనుములం గనుమ లొనరించుకొనం బంచి తాను నొక్కొక్కయెడఁ బాదచారియు నొక్కొక్కయెడఁ దురగాధిరూఢుఁడునై యెల్లయెడల మెలంగుచుం గూత లెగయఁ బణవమృదంగ దుందుభి ప్రముఖతూర్యంబులుగొట్టించియుఁ గాహళులువట్టించియు నగ్నియంత్రంబులు ముట్టించియుఁ రోదమిన్ను ముట్టంజోపు వెట్టించిన

మ. చకితైణాహుతిదావ మావళితపుచ్ఛస్వల్పగచ్ఛత్తర
క్షుకమద్రిగ్రహయాళుభల్లుకము వక్షోభాగనిక్షిప్తడిం
భకవల్గత్ ప్లవగీకదంబము ప్రహ్రాదాంభః ప్రోత్థితక్రోడనా
యక మాభీలముఖద్విపిస్థపుటితం బయ్యె న్వనం బత్తఱిన్. 38

క. నెలవెడలియు నెఱ్ఱిసడలియుఁ
జలముడిగియు నిదురసెడియు జంట లెడసియుం
గలహము లడగియు బఱిచెం
బులి కిరికరి మున్నదున్న మొదలగు మెకముల్. 39

ఉ. అత్తఱివేటకాండ్రు యము నాంబుతరంగ పరంపరాకృతిన్
ముత్తరమైన సూకరసముత్కరముంగని మోటుకాండ్రు వి
ల్లెత్తకమున్న రాజుమది కెక్కుడునట్లుగ దీని ముత్తికిం
బుత్తమిటంచుఁ బట్టెడలు బోరన డుయ్యు భయంకరాద్భటిన్. 40

క. జాగిలములు మొఱసడములు
జాగేఁగలసి చాపముక్తశరగతినం దా
జాగిలములెదిరెఁ బందుల
కైగోధాదికముగాలి కడరె నితరముల్. 41

సీ. ఎగుచు కూఁతలుముట్టెయెత్తి బిట్టాలించి
గమికిఁ గన్నాకయి గాలియరయు
వడిఁగుక్కలంటంగవచ్చిన మెడద్రిప్పి
ఘుర్ఘురించుచు బయల్ కొమ్ముజిమ్మ
దారసించినచోట దారునఁజొరఁబాఱి
యొకటిరెంటినిదొబ్బలురులనడచుఁ
బాలచేరులు వట్టి తూలింప బలిమి నీ
డ్చుకొని డొంకలఁదూఱి చుట్లబెట్టు
గీ. నీటెపోటులఁబడి ప్రేవులీదులాడఁ
బోయిపోలేక దగగొట్టి పాదలు సాచ్చి
బెండువడయును జొరనీదుపీఁట వెట్టి
చూపులనుయేర్చుఁ బ్రజనొక్కసూకరంబు. 42

క. అట్టియెడ నొక వరాహము
బిట్టడచిన మెఱసెఁ గుక్క ప్రేవులు దంష్ట్రిం
జుట్టుకొని రొంపిఁ గలఁపగ
నిట్టలముగఁ దగిలినట్టి యొజ్జలు వోలెన్. 43

మ. హరిణంబొక్కటి కుక్కతండముఁ బుళిందానీకముం ద్రోచి యు
ర్వరఁగా లూఁదకదాఁట నేటలవికిన్ వాహంబునడ్డంబు నూ
కి రసావల్లభుఁడేసె భల్లమున నింగిం గాళ్ళు జోడించుచో
గొరిజల్ నాలుగుఁ ద్రెవ్వ సేన వొగడెం గోదండపాండిత్యమున్. 44

క. పఱచు నొకకడితిఁ బతిముదుఁ
జెరమలకై యేయఁజిప్ప చినుఁగఁగ నది యు
క్కఱఁగాఁడి దుస్సి పాఱిన
నతిముఱి జాపరువాఱి యల్లటు వడియెన్. 44

మ. గవిలో బెబ్బులి డాఁగి గ్రుడ్లు మెఱమంగాఁ గాంచి రాజేసె నే
య వడిన్ బాణము వెంటనే నిగిడిపై కల్లెచి రానేసె రెం
డవకాండంబుఁ దదస్త్రముం గొనక డాయన్ వచ్చి కాత్షేయక
ప్రవిభిన్నంబయి నేలగూలెఁబవిధాఁరాభిన్నశైలాకృతిన్. 45

తే. క్రొవ్వినడగొండ కయివడి గునుప నొక్క
రియింటిగాని మహీనాథుఁ డొదిగి యేయ
గొరక మేనుచ్చి ధరఁ గాఁడ శిరము విసరి
లేదపృళ్వాన మనుచుఁ దెల్పెడు ననంగ. 46

తే. ఒక్కఁడసుగత్తి గొరకవేశమును దాఁచి
నట్టిరిగి బొంకిఁ గని వీఁక బట్టుటయును
మృగయు లందఱుఁ జని తెల్వరించి నిశిత
కాండములఁ జెండి రొక పెద్దకాఁబుపోతు. 47

మ. అసమయంబునఁ జకితమై యొక మెకమ్మగిమీఁద దాఁటి వాఁ
డేసినయమ్ము దమ్మయి మహిం బడకొక్కటి కొండచాలి నీ
లాగులఁ జేయు మెచ్చి వసుధాధిపముఖ్యుఁడు మొట్లమున్న బా
ణాసనభృత్పుళిందులవ నర్థినొసంగ సమీప్సితార్థముల్. 48

క. పలఁబాతినవానిని భటు
లలఁగుళపాలాడి రధిపుకైపట్టిరి బె
బ్బులి మహిప మెలుఁగు కిటి దోఁ
డేలు మొదలగువానిఁగొన్నిటిని వేఁటకిరుల్. 49

తే. మున్ను జాగిలములఁ గూడి చన్నకాట్రి
యుడుప పక్కులు పందెళ్ళు నుందుముప్రల
నుడుముల గ్రహింపఁ బుట్టలకడలఁ బొదల
గిరులసతియలఁ బనివట్టి తిరుగుచోట. 50

చ. బరవసమొప్ప గాలితడఁబాటు మెయింగనిఁ దూఁటి యొక్క ప
ర్కరము దమంబులో వెరఁజి కోలలచేఁ గబళించి పొట్టపెం
జరనుఁడు మంచుఁ దెచ్చి కని చేవ దొరంగక గ్రుంచినైచేఁద
ద్గురుబిరుదప్రమాదములకుం బతి పొదవిపాడిశాలిగాన్. 51

క. ఒడలుబ్బ నిక్కి ముందటి
యడుగులు ధర నూది చిందు నలబలమునఁ దన్
జడియ కొక గబ్బిగండె
పక్కడుఁగడిమిం దివిచెఁ గ్రుంగి కొమ్ములయుడుమున్. 52

తే. కంపమొందు గిడ్డిన క్లేదు గాన జన్న
దరు వెలుంగుచు నొకఁ డేగి పరువుతోన
పడి యడఁగి యుండఁ గాఁ బట పటనముఁడ్లు
గాలిఁ గదలుట గని పంట్ర కోలఁబొడిచె 53

వ. అత్తఱిం దత్తఱంబున మొత్తంబయి చోపుసుఁ గోలలు గొని కొలంకుల పొలంబులం బులుఁగులం జోపుచు డేగవేటకాండ్రు వేఁడుపడి వేటాడం దొడంగి రందు. 54

ఉ. లీలఁ బుళిందుఁ డొక్కఁడు గళిందసుతోర్మి సహోదరీవశాం
దోళితకోక రేఖఁ దన తోరపు నల్లని దీర్ఘబాహుపై
హాలహలంబ పోలె విడి యత్తెఱఁగం దల యెత్తి చూచు బల్
సాళువము న్వడిం జను శశంబుపయి న్విడిచెన్ మహోద్ధతిన్ 55

క. ములుదట్టి చెఱఁగుఁ జెక్కుచు
బలుదిట్ట కిరాతుఁ డొకఁడు పటునఖ ముష్టిన్
పెలకట్టెబట్టి పేటొక
కొలకట్టెం గొట్టివైచెఁ జెవురుం గాకిన్. 56

సీ. పెనుదవ్వు దగఁ గొట్టఁ జని రెట్టవడఁ గొట్టె
నుడువీథి వెళ్లుసుక్క లొక్కయుణుజా
తెక్కఁ దాఁకిన స్రుక్కి నిక్కి ప్రక్కలు నొక్క
నాలిక క్లేటి నోరొక్కరణంబు
పొదఁదూఱు నొక మేటి పూరేటి పెకికిఁబోఁ
దోలి కక్కౌనె నొక్కఁ తోఁచిగాఁడు
తను గెలుదొర చిత్తమున మెచ్చఁ దీవుపుఁ
జనిపట్టె బిట్టొక్క జాలె డేగ
గీ. విజ్ఞాజ్ఞఁ దన్నంగ విడఁవ కెలమిఁ
గఱకుటంఘ్రులఁ దిరికించి గజ్జెగదల
గలికి నెతినెతి కోలెత్తుకయుచు విరుగ
విఱిచె వదెఁ గైజునొక పెద్దవేసడంబు. 57

క. దింగికయి ముంచెయెత్తి వె
సంగో యని యార్వఁ బక్షి సంహతి గాదుల్

తింగని ద్రోయఁ గుజాగ్రవుఁ
గొంగల నొకలగుసు డిగ్గి కొట్టె నిలఁబడన్. 58

వ. ఇట్లాఖేటఖేలనంబున వివిధమృగ విహంగవధం బాచరించి చాలించి యంచె
లంచెలఁ బంచతాపతిశ చమర సృమరకిటిహరిణ రురుమహిషపృషదంశగోధికా
శశ పిశిత ఖాడంబు లొండొండ యున్నత్తుగా నాకుఁ బొత్తరలం
గట్టితుం గుగులుగట్టితుంఁ జిక్కంబులనించితుంఁ గావడు నుంచియు సవ
రించి దిగదిగన విసరి బగ బగన వంగను చిగుఁగుసొదమంటల కడ్డంబుగట్టి
మీనంబులు చూడి చూడి వాఁడులగు కత్తులద్దిత్తులొలిచి కుత్తుకలుఁగోసి పీత
ముఖంబులకు నఖంబులం బెకలించి విపులవపురపహసిత మహాశైలంబులగు
శార్దూలంబుల బొందుల నందందఁ బడవైచి యంతంత గాంతారంబున
దంతురంబుగా బడిన దంతావళంబుల దంతంబులు గైకొనియు దత్కుంభ
నిర్గత మౌక్తికంబులేఱికొనియు గోరజంబుం జమరవాలంబుం బర్హి బర్హం
బులం బరిగ్రహించియు మరలి యుత్తరీ గడిందినెత్తురుం బ్రొద్దగుట వెలు
చలువం జలువ నేఁడు వెతమూండ్లఁ బండ్లసరిఱులు నెఱియలం వారి బోరగం
గారు ధారాళరుధిరాసార పూరంబు నాకి నాకి నాలుకలు దిగవైచి యేచిన
మహాతపోష్ణంబునం దృష్ణపాడమిదగ నిగుడవగ రడరి యొడ్డలం దొడలను
మెడలను బెడిదంపు నిడుదకోఱల . గలుగులడచిన యెడలం బొడ బొడను
వడలెడు నుడుమ నెత్తుటం బడలి తూలు కాలేయకమ్మల యంగమ్ము లార్ద్రి
కర్పటంబుల గప్పి దప్పి నిగుడ నవ్వాలంబు పశ్విను దండనుండు వెండి
కొండల జండకరకర హిండనంబున బాండుప్రభలం నిండిపఱచు తఱచు
నలయేరుల నూరెలం గారుకొను భూరుహ నికాయంబుల డాయంజని తద
ఘచ్ఛాయల నిలిచి యచ్చటం గ్రొచ్చి గరువు శిలల గుంటలానరించి లోన
సమ్మగిలి గబ్బునలవక కమ్మతావుఁగల నావుగావులు పఱచియొఱచి లోమే
లేఱి శారిజముం గందసకాయ గ్రొవ్వు మొనలగు మిగుల మెత్తని పలల
ఖిత్తంబులందుఁ గ్రందుకొనం గ్రక్కి యొక్కొక తక్కువలు గాకుండ గండ
గల తింత్రిణీ శలాటు సంఘాతంబులామీద నెఱయం బచరించి యొసరుగాఁ
లేటలగు లేటి నల్లు గ్రుమ్మరించి లవణకణసంచయంబు నించి లావుగాఁ
గావుగప్పి యుపరిప్రదేశంబులఁ గారెనుప పెంటసల్ల నీరారు నేలుఁ బుడు
కల దాళ్ళిడి నెలికొయ్యలఁ ద్రచ్చి నుచ్చులంటించిన బెచ్చుపెరుగు చిచ్చులా
త్రింపులం దవిలించి చిమడసుడికిన కొలఁకరించి ఉప్పును వెప్పనుంగలయప్పిలిత

వెన్న గేంద్రపుంజముల్ మిన్నందివెన్నంటి
తారాడుఁ దన గుబ్బలొమ్ము లొద్ది
యొందుండు గురివెంద పందిళ్ళపూదేనె
జడియించు శిలలందు జాలువాఱు

గీ. నట్టి కలధౌతశిఖరిఁ బుష్పాపచయము
సేయు వేడుకఁ బొదరిండ్ల చాయలందుఁ
దిరుగుచుండి యొకానొక దెసఁ దృణంబు
దళముగా వాలి మొలచినబిలమునందు. 78

ఉ. ఊసర వెల్లి చందమున నొక్కొకచోట బీటవరాలు దేలగా
మీసలు గడ్డముం జడలు మే నుదరంబును వీడుగన్ జరా
ధూసరమైన రోమతతితోఁ బెనఁగంబడి దూదిరాశిగాఁ
జేసినరీతి నున్నయొక జీర్ణమునిం గని కౌతుకంబునన్. 79

ఆ. ఇతని వదనపుహారమెద్ది నేత్రద్వయం
బెద్ది కర్ణయుగళ మెద్ది యనుచు
జూచివోలె నున్న వాచంయముని మోము
శల్యచాపమునఁ బట్టుటయును. 80

క. ధ్యానస్తిమితుండగు న
మ్మౌని మదీయాంగుళీవిమర్శనములచే
మేనెఱిఁగి తొంటియనుసం
ధానము చెడి కన్ను దెఱచి దాయుఁ బలికెన్. 81

ఉ. ఓసి దురాత్మురాల కృపమొల్లక సర్వసుఖంబులున్ నిరా
యాసమునం దొఱంగి మహిరాంతమున చ్ఛదనీరనీరస
గ్రాసము దేహధారకముగా గుహలం దపమాచరించు మ
మ్మోసరణిన్ స్పృశించి నగ నేమి ఫలంబొనఁ గూడెఁ జెప్పుమా. 82

క. తిమిరంపువయసు గుబ్బల
కోమరాలవు నీవు దగిన గోవాళ్ళ మహిన్
చెమకి నగరాదె ముదిసిన
మము కెలఁకిన నేమి కలదు మద మేమిటికిన్, 83

క. మూఁకుఱుకొను జరభరంబున
నసు రుసురై యున్న మున్కు వడఁకించితి వి
ట్లు కుఱు మనఁ బట్టుపడు మొక
యసురవ నీవనుచుఁ బలికె నాగ్రహ మెసగన్. 84

క. జననాథ యేమి చెప్పుదుఁ
గనలుచు నవ్వగ్గుతపని కటము అదరఁగాఁ
దనచేతి నాఁగ బెత్తను
గొని పసరముఁ గొట్టినట్టు గొట్టె నదయుఁడై. 85

క. కొట్టువడి యటకు మునుపే
తిట్టుంబడి యేడ్చు వాదు దెసఁ గని మదిలో
గట్టులుక వొడమ నాగఖు
లిట్టనిరి మునీంద్రుతోడ నెత్తిన పెలంచన్. 86

ఉ. ఓయి దయావిహీనమతి యూరక యీపసిబిడ్డఁ గొట్టఁ గాఁ
జేయుటు లాడె నీవ నిది చేసినదేమి వృథా శపింతురె
బోయవె యాఁడుఁ దోఁడు నను బుట్టవె శాపనిమిత్త మేకపం
బీయెడ నున్న శాంతిపరులే మహవా రిక నీచరిత్రమున్. 87

క. పాము కడు ముదిసి కడపటఁ
గాముగు చందమున వార్ధకంబునఁ గ్రోధం
బేమియు మానక నుండెడు
సాముని మునియే తలంప నదియుం దపమే ? 88

క. పరుల యపరాధగతులకు
గెరలక తనుఁ బొగడచోటఁ గీడాడెడుచోఁ
బరితోషము రోషము నెదఁ
జొరనీని తపస్వి యుమ్మ సుకృతి ధరిత్రిన్. 89

తే. ఒండొకడవైన నిపుడు నీపిండియుడమె
బ్రాహ్మణుడవౌట మాచేత బ్రదుకగంటి
తడవ బనిలేదు నిన్ను గౌతముని గోవ
వనుచు వాదించి విడిచిన నాగ్రహించి. 90

సీ. పక్కపక్కన సంఘ్రిపాశముల్ వెసఁద్రెంచి
దేఁగతండముల మింటికిని విడిచి
గళగళ ధ్వనులతోఁ గంఠశృంఖల లూడ్చి
కుడివడ గుక్కల నడవి గలిపి
గుప్పుగుప్పున మోచికొనియున్న వలలతోఁ
బలలంపు బొత్తరల్ పాఱవైచి
కంగుకంగున నేలఁ గ్రైదప్పగా బకు
వేఁబమ్ము తేరక దాటి దాటి

గీ. తిరిగిచూచుచు దబ్బెఁ దీసికొనుచు
దగలు ద్రొట్టి యథాయథ లగుచు విరిగి
యొకడు వోయినత్రోవ వే ఱొకడు పోక
కొట్టొకడు గాఁగ బఱచిరి చెంచు లపుడు. 103

క. ప్రాపుఁ దలపోసి నిలువక
పాపాత్మకులై కిరాత బల మఱుపాఱన్
భూపతి యయ్యంతివాయ
స్థాపితఁగా జేసిపలికె దన్మంత్రిముఖ్యులకున్. 104

ఉ. కైదువు లున్న పూజ్యములు కంటకఖేటశరస్థలత్రముల్
లే దరదంబు తత్తడి పలు శక్తి సహాయము సర్వమంగళం
బీ దనుజుండు చిక్కె భయ మేటికి లబ్ధపరాక యాత్మకుం
బేపతనంబు మేలె మఱి మృత్యువు డాఁగడిచోట లే దొకో. 105

ఆ. నీడఁ గడవఁ బాఱ నేలకు కాలిగాఁక
నడుగు పెట్టి తిరుగ నాత్మ మొఱఁగి
రొకటి దలప నరుల కొదవిన నొదవదే
కరణి మృత్యుజీవిఁగన్న బ్రామ. 106

క. చావుఁ దలపోసి మానవుఁ
డేవగ దుఃఖిత్రి నొరయు కే దినములు పాం
కై వెడలుంగట్లు గడకఁగ
కైవం బటమీద మేలు తాన ఘటించున్. 107

సీ. బుద్ధీంద్రియక్షోభ ములకు బెట్టని కోట
విపదంబురాశి దుర్వికృతితోడ
ఖలదురాలాప మార్గణ వజ్రకవచంబు
రణమహీస్థలికి శ్రీరామరక్ష
శాత్రవదుర్గర్వ సంస్తంభనౌషధి
మొనయు చింతాశ్రేణి మూకవిప్పు
యోగాదిసంసిద్ధు లోనగూర్చు పెన్నిధి
తూలు నే కావల తోడునీడ

గీ. సకలసుగుణ ప్రధానంబు సకలకార్య
జాలసాఫల్యకరణైక సాధనంబు
ధైర్యగుణ మట్టి ధైర్యంబు దక్క పోరఁ
దత్తరింతురె యకట మాతరమువారు. 108

క. అని తెలిపి తిరుగ డగుటయు
మనమున లజ్జించి రొయిలుపు మన్నిలిఁక నీ
జనపతి కోడిద లోకం
బని తమతము మొనలు గ్రుప్పి రవియును దిరిగెన్. 109

వ. ఇట్లు తిరిగి యొక్కొక్క రక్కసుం డెక్కడ నని యక్కూట బలంబులగు
డంబులం గటారుఁలీఁటెలు బాదీఁటెలు విడ్లు గంధ్ర గొడ్డండ్లు జిల్లకోలలుఁ
బంట్రగోలలుం మెరయ రయసముద్ధూత ధూళిపూరిత ధారాధర పథం
బగుచు నొక్కపరియ చీసుపరి యనంగ విసె నందు. 110

మ. శరసంధానములోనె కొన్నియడుగుల్ జౌజవ్వనం బాతి య
ధరణిం గాల్కొని ద్రోణములఁ దివియు దోర్దండంబులం జేఁది యే
నెరి బోయల్ దిను మంచు సార్చి వరఁగంజెట్టాసలన్ డాయుచున్
గొరవంకల్ మెఱవెట్టి [illegible] ఘోషింపనోషింపుమున్. 111

తే. త్రికరావళి వమ్ముదు జాళ [illegible]
శీఅ న్యుదంశకము మళ [illegible]
చప్పుడుము విధంబున కాల [illegible]
వంప్రిపెలఁ జప్పరించి రౌద్ర [illegible] 112

శ్రీ

# స్వారోచిష మనుచరిత్రము

* * *

## పంచమాశ్వాసము

క. శ్రీనందన సౌందర్యసు
ధీనందన వితరణావధీరిత బలిరా
డ్భానుజ పరరాజ్యస్వ
ర్భానుభుజాహీంద్ర కృష్ణరాయ నరేంద్రా 1

వ. అవధరింపుము జైమినిమునీంద్ర మాడారిత్నంబునకు నీడోద్భవఖగంబు లిట్లనియె.

తే. అపుడు గంధర్వపతి మహీపతికి రుచి
రాజి విస్మయమున మాయ రాజు దిగ్గ
నక్కఁ జేర్చి ముదంబుతో ననియె దంత
కిరణములు హార కాంతులు సరసమాడ. 3

సీ. భద్రమా నీకు నీ బాహాధృతక్షితిఁ
బ్రజ లెల్ల లెస్సలా రాచవారు
ధన్యుండ నైతి నీ దర్శనంబున నేని
వాదుష్కృతము లెల్ల నాశ మొందె
నీజగత్త్రయి నన్ను నిందీవరాక్షాఖ్య
గీర్తించు నస్మద్గీతిసరణి
గారాపుమీతల్లి కడవాఁడ గాని నే
గణుతింప గలవాఁడఁ గాఁ జుమయ్య

గీ. పెండ్లికొడుకవు మాకు నీ బిసరుహాక్షి
మార్మినందన యొకమౌని ఘోరశాప
వికృతి మానిసితిండినై యకట దీని
ప్రాణముల కల్గఁ దలఁచితి పాపబుద్ధి. 4

క. అనునెడ వచ్చి మనోరమ
జనకుని పాదముల కెరఁగ సస్నేహమతిం
గనుఁగవ నీరొలుకఁగ నం
దనమూర్ధఘ్రాణ మతడు దయఁ గావించెన్. 5

ఆ. అపుడు విస్మితాత్ముఁడై వరూధినిసుతుఁ
డేమి కారణమున నీతపస్వి
యిట్టిశాప మిచ్చె నెఱిగింపు వినవేడు
కయ్యె ననఘ యనిన నాతఁ డనియె. 6

మ. కలఁడుల్లోకయశఃపురంధ్రి జగతిన్ గంధర్వవంశంబునన్
నల నాభాహ్వయుఁ డేఁ దదీయతనయుండన్ బ్రహ్మమిత్రుండు శి
ష్యులకుం గంటను వత్తిఁ బెట్టుకొని యా యాయుర్వేద మోరంత ప్రా
ద్దులఁ జెప్ప న్వినుచుండి మానసమునందుం దజ్జిఘృక్షారతిన్ 7

తే. మౌనివరుఁ జేరి భక్తినమస్కరించి
చెప్పవే సాధు నీవిద్య శిష్యకోటి
తోడఁ గూడంగ నే కృతార్థుండ నగుదు
ననుచు బ్రార్థింప ననుఁ జూచి యుపహసించి 8

క. నట విట గాయక గణికా
కుటిలవచశ్శీధురసము గ్రోలెడు చెవికిం
గటు వీశాస్త్రము వలది
చ్చట నినుఁ జదివింపవన్న జరగదె మాకున్. 9

తే. అనగ నే నట్టివాఁడఁ గా ననఘచరిత
యించుకించుక మీవంటి యొరులకలుగు
పెద్దవారలశిక్షణ బెరిగినాఁడ
నవధరింపుము శిష్యుగా ననిన నతఁడు, 10

క. ధన రాజ్య రమామదమునఁ
గనుగానని నిన్ను శిష్యుఁ గాఁ గైకొను కం
టెను నేరమి గలదే ననుఁ
గనలించుచు బ్రేలకిఁక బోఁ జాలు మటన్నన్. 11

క. అచటన్ "ద్వేష్టిగతాయు
శ్చ చికిత్స" మను నయోక్తి చర్చను నుచ్చా
వచవచనంబుల దోపము
ప్రచురముగానీక మాని పతి కిట్లంటిన్. 12

తే. నీవు సదివింతు వనుచు నిన్నియును విడిచి
బిచ్చ మెత్తంగరాదుగా బేలతపసి
కడవనాడవుఁ జాలు నీ గొడవ యేల
వెజ్జుఁ దనమేల యన మది లజ్జవొడమి. 13

శా. కంటే బ్రాహ్మణుఁ డెన్ని కాఱు లఱచెన్ గర్వించి వీరెల్ల నా
కంటెం బాత్రులె విద్య కల్లె విది నేర్గకొందు నంచు న్మదిన్
నెంటెంపుంజల ముప్పతిల్ల గపటాంతేవాసినై శాంబరిన్
గొంటుంజందము మీర శిష్యులఁ గాడం గూర్చుండి చర్చారతిన్. 14

తే. కాయబాలగ్రహోర్ధ్వాంగకములు నాల్గు
శల్యదంష్ట్రాజరావృష సంజ్ఞ నాల్గు
నైన యష్టాంగకము తావు లారఁగల్గు
వైద్య మెనిమిది నెలల సర్వమును నేర్చి. 15

క. ఇరుమూడురుచుల దోషపు
విరసత మానన్ జ్వరాది వృష్యాంతంబై
పరఁగు చికిత్సయుఁ గని శాం
బరిఁ బాసి తపస్వితోడ మదఘున నంటిన్. 16

శా. తండ్రీ నాకు ననుగ్రహింప గదె వైద్యం బంచుఁ బ్రార్థించినన్
గండ్రల్ గానటులాడి ధిక్కృతులఁ బో కాల్మంటి వోహోమదిన్
దీండ్రల్ గల్గినవారి కేకరణి నే నిన్ విద్య రాకుండు నే
గుండ్రా డాఁచినఁ బెండ్లియేమిటికిఁ జిక్కం కష్టముష్టింపచా. 17

మ. అనినం గన్నులు జేవుఱింప నధరం బల్లాడ వేల్లత్ప్రవః
పునరుద్యద్భ్రుకుటీభుజంగయుగళీ పూత్కారఘోరానిలం
బన నూర్పుల్ నిగుడన్ లలాటఫలకం బందంద ఘర్మాంబువుల్
చిలుకం గంతుదిదృక్షురూక్ష నయన క్ష్వేలాకరాళధ్వనిన్. 18

వ. జటిలుండు గిటకిటం బండ్లుకొరికి హుమ్మని కటమ్ము లదుర ముకుఁ బుటమ్ములు నటింపఁ గటాకటా కుటిలాత్మ యటమటమ్మునవిద్య గొనుటయుం గాక గుట గుటలు గురువుతోనా యని కటకటం బడి కకపాలలోని బూది కేలం గొనియాసురియగు మాయ మాయెడం బ్రయోగించి యపహసించితివి గావున నసురవై పిశితంబును వసయును నసృగ్రసంబు నశనంబులుగా మెసవి వసుధ వసియింపుమని బసుమంబు సల్లగుం డెజల్లుమనికల్లువడి మునితల్లజు పదపల్లవంబులం బ్రెల్కి యిట్లంటి. 19

శా. నాయజ్ఞానము సైచి సంయమివరేణ్యా! కావవే రాక్షసుం
డై యే నెట్లు భజించువాఁడ దురితం బయ్యో నృమాంసంబు కూ
డై యే నెట్లు భరించువాఁడ నుదరం బార్ద్రాంతరంగుండవై
యో యయ్యా! దయసేయవే యవధి యే నోపంగదే హింసపన్. 20

చ. అనినఁ బ్రసన్నుడై ముని కరాబ్జములన్ నను నెత్తి వత్స! మ
త్సునిశితశాపకూలహతి స్రుక్కితిగా యిఁక గొన్ని నాళ్ళపైఁ
దనయను మ్రింగఁబోయి యొక ధన్యుని దివ్యశరార్చి బ్రేలి వే
కనియెదు భద్ర మన్నఁ దురగంబు పయింబడి ప్రొద్దు గ్రుంకగన్. 21

క. సన్నఁపుఁ దలయేరున మయి
యన్నుకొనుచు నాము దిన్న యట్లయి రాఁగా
ఖిన్నుఁడనై పురి కేగితి
దిన్నదనం బుడిగి కొన్ని దివియలు వెలుగన్. 22

క. అంప దగువారి గసరుచు
నంపి నగరుసొచ్చి వెలదు లారతు లీఁగ
నింపఱ గశాభిహతులం
జంపించితి వారి నన్నిశామధ్యమునన్. 23

సీ. అభ్రమండలి మోచు నందాఁక నూరక
పెరిగినట్లొ మేను నరవరేణ్య
యవధిభూధరసాను వందాఁక నూరక
పరచినట్లొ మేను పార్థివేంద్ర
యబ్జభూభువనంబు నందాక నూరక
యెగసినట్లొ మేను జగదధీశ
యహిలోకతల మంటు నందాక నూరక
పడినయట్లవు మేను ప్రభువతంస

గీ. యఖిలజగములు మ్రింగునం తాఁకలియును
నబ్ధు లేడును జెడఁ గ్రోలు నంత తృషయు
నచల చాలన చణమైన యదటు గలిగె
నసురభావంబు నను జెందు నవసరమున. 24

క. రక్కసుఁడనై నెపంబిడి
యొక్కొక్క యపరాధమునకు నొక్కొక్కఁడుగా
బొక్కఁగ లోకము పురపురఁ
బొక్కఁగ బాడయ్యెనంతిపురంబున్ పురమున్. 25

తే. దారుపాడైనఁ గళవుల యూళ్ళవరిక
మెసవదొరకొంటిబ్రజమారి మసగినట్లు
తితెఁగతిపయదినముల దేశ మెల్ల
మల్లె వట్టినచేని క్రమంబు గాగ. 26

వ. ఇవ్విధంబున విధివిధానంబున యాతుధానుండనై ధారాధరోత్సేధంబును నతినిశితరోమసంబాధంబును ధూమసమధామంబును ధృతాంత్రదామంబును జలత కపాలఖండళంబును జ్వలితసితదంష్ట్రామండలంబును నాగాయుత త్రాణంబును మస్త కోత్తుంగఘోణంబును నై యనవరత హింసానురూపంబగు రూపంబుఁదాల్చి శకటాంగ్ర భంగికమ్ములై యింగలమ్ము లొలుకు నపాంగమ్ములం బిశంగమ్ములగుచు బళ్వబ్జనాను మోచనమ్ములగు లోచనమ్ములు వెలుంగ బభ్రుకేశమ్ములు దూల సకల భూత భయంకరమగుపటిమ నచటి యుటజమ్ముల వతికి జటియనక వటువనక యతివనక వ్రతియనక గృహియనక సతియనక శిశువనకభక్షించిభక్షించి కుక్షింభరత్వంబునం బ్రవర్తిల్లితి నదియట్లుండె వినుము, తారలకు వర్ష ధారలకు నిసుములకుఁ గసవునకు లెక్క గలిగినం గలుగుగాని మదీయ జఠరానల జీర్ణజంతుసంతానంబునకు లెక్క యిడ నక్కమలగర్భుండునుఁసమర్థుండుగాడిట్టి కృత్రిమదనుజభావావష్టుండనగు నాదౌష్ట్యంబు సవసవగాఁ దెలిసి ముదురకయమున్న యుత్కళత్రంబులం బుట్టినింటి సా రుత్సవావలోక వ్యాజంబున ననిపించుకొనిచని నిజగృహంబుల నునిచి రక్షించుకొనియుండి రిపు డే వశనంబుగానక కన్న యిక్కన్నియుం గైలాసకాననంబునం గుసుమంబులు గోయుచానింగని కనికరంబుడిగి కడుపుఁ జిచ్చునకు మ్రింగం దలఁచి కొని వచ్చి యిచ్చోట భవదీయ దర్శనంబున వృజనరుజవలవిముక్తుండనై నిజప్రకృతిం బొందికృతార్థుండనైతి.

క. ఈ యుపకారమునకుఁ బ్రతి
సేయఁగ శక్యంబె జంభజిన్నిభ శఫరా
త్యాయతలోచనయైన మ
దీయాత్మజ నీవు నిత్తు దేవీమణిగన్. 28

క. ఆయుర్వేదముఁ గైకొని
యీయింతిం బెండ్లియాడు మెలమి రమా నా
రాయణపరిణయ గేయవి
గాయనగంధర్వమైన కవ్వపుఁగొండన్. 29

లయ. అన్నగము పైజరత పన్నగపతిస్ఫుటల
నన్నగనికోటతుదలన్నగడుకొమ్మల్
మిన్నగలరాయరుచిఁ జెన్నగువిమానముల
తన్నగడపన్నగఁ బ్రభిన్నగజఘోట
చ్ఛన్నగమానాపణము లన్నిగనిగద్యుతి ర
విన్నగుమణిప్రకర మున్నగరిమం బే
రెన్నఁగలయంగడుల వన్నెగనిసంపదల
మన్నగరియొప్పు బలభిన్నగరి దేవన్. 30

తే. అని నిజోదంత మావంత యైన దాఁప
కంతయును జెప్ప నద్భుతం బంతరంగ
మంతయును నిండి హర్షించె నాస్వరోచి
యంతరవియోగఁ బశ్చిమాశాంతమునకు. 31

మ. వికసిల్లం బ్రజచక్రపాలనము గావించెం గరవ్యాపృతిం
గకుబంతంబుల నాక్రమించెఁ బొసగం గా నేర్చెఁ దర్ణాలి గాం
తికిఁ బాసెం గలరాజకోటిఁ దుది గాంతిం బొందె దైవంబు నేఁ
తకుఁ దాపం బిఁక నే లనంగ నిను డస్త్రప్రాప్తుఁ డయ్యెం గడున్. 32

తే. అసురవరు డైన యిందీవరాక్షు మేన
నంటుకొన్న స్వరోచి బాణాగ్ని పోలె
నంతఁ గనుపట్టె శుకతుండకాంతిదొగడి
సాంధ్యరాగంబుపశ్చిమాచలమునందు. 33

క. తలఁచూపె నప్పు డఖిలా
శల దట్టఁపుటిరులు చిలువ జవరాలు నభ
స్థల మండపోపరిసీఁ
మల నిడిన నితాండపటలి మాడ్కిం జుక్కల్. 34

ఆ. సాంధ్యనటనచండ చండీశపదహతిఁ
ధరణిచక్ర మొరగి శరధిఁ గ్రుంగ
దోర గల్లువడియె భూరథేతరభాగ
చక్రమనగ నపుడు శశియు దోఁచె. 35

క. తమ మనుకాలహి ప్రపం
చము సెరగొని యోషధీశ సద్యఃకృదం
డమున మగుడం గ్రక్కుడు
క్రమమున నొయ్యొయ్య విచ్చి కడలకుఁ దొలగన్ 36

వ. అనంతరంబ క్రమక్రమంబున, 37

సీ. కలయ వెల్లువఁ గట్టి జలజలఁ బ్రవహించు
శశికాంతవాఁతనిర్ఝరము జలము
మలయానిలముచే దుమార్గంబున రేఁగు సౌ
గంధికంబు రజంబు కలువదుమ్ము
నిండార విరిసిన బొండుమల్లెల నుండి
వడియు మరందంబు గుడరసంబు
తొలఁకి మింటికిఁ బొంగు దుగ్ధపాథోరాశి
కరడులమీఁది మీఁగడల మెఱుగు

గీ. తనకు రసవర్గములుగా సుధాకరుండు
సారెసారెకుఁ గరములు సాఁచిసాఁచి
యచ్చ తెలుపుగ నపుడు బ్రహ్మాండమండ
పంబు వెన్నె లసన్న సున్నంబు సేసె. 38

వ. ఆసమయంబునం బరిశ్రాంతుండను నమ్మహీకాంతుం డొక్క శశికాంత శిలామండపంబున దట్టంబుగాఁ బఱచిన చిగురుపఱుపుల గంధర్వరాజునుం దానును సుఖాసీనుండై యిష్టకథాగోష్ఠి నారాత్రిగడపె నంత. 39

సీ. తనుఁబాసి శశి దవ్వు చనిన సెవ్వగఁ బోలెఁ
దొలిదిక్కుజవరాలు వెలుకఁబా
ప్రథమాద్రిసభయందుఁ బఱచిన కెంబట్టు
జముకాణ మనఁగ రాగము జనించె
ధవుఁగూర్మి కొసరుచున్నవిపోలె ముఖరాళి
వనరుహాస్యములఁ బద్మినులు తెఱచె
భానూష్మభీతి మున్పడిన చుక్కలభంగి
దొరలె వేకువగాలిఁ దరులమంచు

గీ. కాలగుణయుక్తి మింటి చక్కటికి నెగయ
వాసవునిపట్టిపొడవుగా వైచియాడు
గచ్చుచమరిన దారుచక్రంపుబిళ్ళ
పోలె నొయ్యనఁ బ్రాచి లేఁ బ్రొద్దు పొడిచె. 40

క. ఈగతి నత్తఱిఁ దెలతెల
వేగిన గంధర్వపతికి వేగుట విని తా
రాగమున నేఁగి కాంచిరి
రాగమ్మున గొలిచి మనుపురాతన ఖచరుల్. 41

ఉ. గాంచినఁ బొంగి వారొసఁగు కానుక అర్థిఁ బరిగ్రహించి మ
న్నించి పురప్రయాణరతి నిక్కనరేంద్రుఁడు మున్ను గాఁదటి
చ్చంచలవాహమై మణుల చాయల దిక్కు లలంకరించు హొ
న్నంచు రథంబు చాఁగు బళియంచు నకీబులు మ్రోయ నెక్కనన్. 42

క. నందనయూ నుచిరరత్న
స్యందనమునఁ జనియె నర్థి జనకునిబడి న
య్యిందీవరాక్షుఁ డీగతి
మందరమున కెగయ గగన మార్గమునందున్. 43

సీ. మండిగా లిడి దంత శుండాగ్రహతిఁ జించి
జలధరాంభముగరుల్ చల్లులాడ
నహిమాంశుహయ హేష లాలించి చెవివంచి
కరలివాజులు బ్రయల్ గొరిజద్రవ్వ

ధ్వజవాతహతి నార వైద్యుతాగ్నులఁ జూడి
పగలు దివిలయవారు పంజాలెత్త
బేటులు చప్పుడు లాత్మ భీరుస్వయంగ్రాహ
పరిరంభసుఖము ఖేచరుల కొసఁగ

గీ. చామరప్రభ గగనగంగా మరాళ
చకచకభ్రమ మొదవింప శంకరాద్రి
కాననము మోచి మందరా గంబు, దాకఁ
బాఁజు పెట్టిరిదన్మూల బలము దొరలు. 44

క. కుంజరశతాంగహయభట
రంజితమై పైరజఃపరంపర అలమన్
మంజులకాంతిఁ గనీసపు
మాంజిష్టముఁ బోలె గగన మండప మమరెన్. 45

తే. సారిది నీరీతి దివిఁ దోడు సూపినట్టి
దొరలు గొలువంగ ఖచరేంద్రుఁ డరిగి యరిగి
మింట గ్రహరాజు తనసగ మింటవెలుఁగు
మంథగిరిఁగాంచి పలికె నమ్మనుజపతికి. 46

సీ. జరఠకచ్ఛపరాజు చరమాంగ గృహమేధి
భోగివేష్టనరేఖఁ బోలుచు జాణ
కులములోఁ దరితీపు గలిగి మించిన మేటి
మై నాడు నొరసిన మాసటీడు
తొలువేలుపుల వేలుపులపనుల్ గొను ఱేఁడు
కడలిరాయలలోతు గన్నగబ్బి
సురరాజునకుఁ బాండు కరిఁ జేర్చు మరకాఁడు
కల్పకంబుల పంట కమ్మతీఁడు

గీ. కంటె మథితసుధాధౌత కటకజాత
చంపక వనప్రకరపనసా కంపవిసర
ఉఖరముఖరవమధుకర ముఖరశిఖర
కందరసుమందిరం బగు మందరంబు. 47

శా. వైడుంతాంగదహేమ మాతతవల ద్వ్యాతాశవాక్పృష్ణరే
ఖాకారంబులఁ జుట్టునంటి మొలనూలై మేటి యొడ్డాణమై
శ్రీకారప్రభఁ గంతియై శిఖరిరాట్సింహోల్లసత్పట్టమై
యాకొండం గనుగొంటె మాయసిపుడున్ హేరాళపుం గాంతులన్. 48

తే. వేదవేదాంతముల వేధ వెదకి కనని
పద్మలోచను శ్రీపాద పంకరుహము
లబ్జరేఖాంకితము లవే యచలవంశ
వల్లభుని మేఖలాసీమ నెల్ల మెఱయు. 49

ఉ. నాలుకబంతి వ్రేలఁబడి నంజనఁ దోఁగి తమాలపల్లవ
శ్రీల హసింప నుబ్బి కనుఁగ్రేవల జేవురు పుక్కిలింపగా
నాలికమేని పీఁ చెగయ వాడినమాల్యముపోలె నావిమ
వ్యాళము దీనిపగ్గమయి నట్టి యవస్థఁ దలఁతు నెప్పుడున్. 50

చ. బిలముఖపంక్తి నీధరణి భృత్పతి వారిధి నిర్భర భ్రమిన్
దలముగ మున్ను ద్రావిన సుధారసధారగుణంబునం జుమీ
పలితవికారదూరనిరపాయసుఖస్థితిఁ గాంచె నాఁగఁగో
మలవిచలచ్ఛిరోరుహతమాలవినీలిమ రేఖ యొప్పెడిన్. 51

చ. జడధి మథింప జిక్కు సుధ సౌరభ మానుటఁ జావు దక్కఁడా
పడతులనుండి దుగ్ధభవ పాండిమ బొందుల నంద మొందనిం
దడవినికాలతోఁ గదుపులై చరియించును మేఁతకై బయల్
వెడలి ధునీకుళీరశఫరీమకరీముఖవారిజంతువుల్. 52

మ. అనుచు జందనపంక పంకిలతలం బై కేతురుద్ధాతపా
ధ్వనిరుద్ధంబయి మంచకోపరిపటీ వాటీనటన్నర్తకీ
జనమై యావకసర్వతఃకలిత వీక్షాతోరణస్రఙ్నిబం
ధనమై యొప్పు పురంబు సొచ్చి భవనద్వార ప్రఘాణంబునన్. 53

క. మంతుల బాంధవ భట సా
మంతుల నాశ్రితుల నినిపి మహీకాంతు నిశా
కాంతమణికాంత కందళ
కాంతంబగు నొక్కదార నగరి విడియించెన్. 54

వ. విడియించి యనంతరంబ యంతఃపురకాంతాకరాంతతరంతన్యమాన మణి భాజన నీరాజన మంగళంబు లంగీకరించి ప్రియాంగనల సంభావించి మగుడ నాస్థానమండపంబున కేతెంచి మతంగ మంకి మంకణ మందపాల మరీచి మాండవ్య మార్కండేయాది మహామునుల రావించి లగ్నంబు నిశ్చయించి గగనచరజంఘాలకరఁ బ్రేషితలేఖతరు లేఖాముఖంబుల జిత్రరథ చిత్రాయుధ చిత్రసేనాదులగు గంధర్వులను వరాహకర్ణ గజకర్ణ సుకేతుమాణిభద్ర ప్రముఖయక్షులను రేవంతి ప్రముఖగుహ్యకులను మందార ముఖ్య విద్యాధరులను బిలిపించి వినయపూర్వకంబుగ విత్తాధిపతికి విజ్ఞాపనపత్రిక లిఖించి నిజప్రధానులం బంచి నలకూబరు రావించె నంత. 55

క. పసుపుల నలుఁగిడి రైదువ
బిసరుహలోచనలు పెండ్లి పెద్దల యాజ్ఞన్
వసుధాధ్యక్షుబుభుక్షున
కనితాలకభరుఁ బేరటాండ్రోగిఁ బాడన్. 56

ఉ. మజ్జనమాడె రాజు కృశమధ్యము లింపున వంప గుంపులై
గొజ్జగనీటి వెల్లువలు గోనజవాజుల నిగ్గు జూప జం
చజ్జరతాహికంచుకము చాయమడుంగుల నొత్తెఁ జెమ్మనీ
రుజగిల న్వహించె మెయి నూఁదినఁ బాలు దుకూలచేలముల్. 57

చ. గరువునరొత్తె జెంగలువ కచ్చుఘటించిన మావి జొట్టె జెం
దిరిక చెఱంగునం బసిడి తీఁగలు నించిన జిల్లుపాగ బం
ధురసధవాసవా పవన పారణఁ దేల నలందెఁ గస్తురిన్
మరకతమాత్కి కాది మణిమండన మండితుఁ డయ్యె నయ్యెడన్. 58

మ. కదిసెన్ లగ్నమటంచు మంత్రులు దొరల్ గంధర్వరాజాజ్ఞను
న్మద వేదండఘటాభటాశ్వ రథసేనాజైత్రవాదిత్రసం
పద మీఱం జనుదెంచి కాంచి ముద మొప్పం జేసి రారూఢుఁ గా
గదళీకాంచనకక్ష్యల న్మెఱయు లేఖస్వామిచౌదంతిపైన్. 59

ఉ. అత్తఱిఁ బట్టణంబు వికచాంబురుహాక్షులు కౌతుకంబునం
జిత్తము లుల్లసిల్లఁ గయిసేసి గృహాంగణసౌధమాలికల్
హత్తి నరేంద్రవీథిఁ జతురంగబలంబులుఁ గొల్వఁ గా మరు
న్మత్తగజంబుపైఁ జను కుమారశిరోమణిఁ జూచి రుబ్బునన్. 60

ఉ. అంచెలు గట్టి కాలితోడు సైచన నీవు గదమ్మ ప్రోదిరా
యంచ లి వేటిసంగడము లయ్యెను దయ్యెమ యేటివేడ్క నా
కంచు బదంబు నన్మొరయు నందియ యూడఁగ దన్ని పోయి వీ
క్షించె లతాంగి యొత్తు మురజిన్నిభ సాగరు మేఖలావిభున్. 61

చ. వలపులపల్లవుండొకఁడు పట్టిచలంబున నేఁప దీనయై
యలుకలు తీర్చి తీర్చి యొకయచ్చరవచ్చి నృపాలు నన్నగ
ర్వ్యాలువడి చూచెఁ గాముకుఁడు వెంటని రా నపు డాత్తఘర్మయై
వెలువెలబాఱెఁ దన్ముఖము వెల్వలఁబాఱె విటాననాబ్జమున్. 62

చ. చిలుకలకొల్కి కల్కి యొక చేడియ నాటకసాల మేడపై
నిలువున నాడుచుండి ధరణీపతి జూడ దలంచి యంచునన్
నిలచిరహిం గనుంగొనుచు, నెయ్యమునం దనువల్లి యబ్బకం
చెల తెగిపడ్డఁ గేతనము చీఱచెఱంగున మూసెఁ జన్నులన్. 63

ఉ. కీరమనోజ్ఞవాణి యొక కిన్నరి కిన్నర మీటిమీటి యొ
య్యారపులీల నేగిఁ వసుధాధిపుఁ గన్గొనె జిగ్గుపయ్యెదన్
హారముఁ జక్కఁబెట్టెడు కుచాహితహస్తము పైఁడిగోళ్ళ హిం
సారతి సేయు దర్పకుని సంపెగములుకులఁ బోలె మించగన్. 64

చ. పరవశదైన్య మాడుకొను ప్రౌఢలఁ గానగు ఘర్మవారిచేఁ
గరఁగి స్రవించు చిత్రకము గాన దనాదృతవీటిపాటలా
ధరమున నున్న మంటినవిధంబును గానదు నవ్వుటాలి కా
భరణమి గొన్న గాన దొక బాల నృపాలునిఁ జూచి నివ్వెఱన్. 65

చ. అలికులవేణి యొక్కతె రతాంతమునం దనయంగవల్లికం
బులకలు చొక్క లేఁజమరు బుట్టఁగ నేఁగి నరేంద్రుఁ జూడ నా
పులకలు చొక్క లేఁజెమరుఁ బోవక యట్టుల యుండె నట్టి దోఁ
జెలువగు వానిఁ గన్గొనిన చెల్వకుఁ బూపుల గావె కూటముల్. 66

చ. అలరులబంతి జృంభకవు నడ్డము సేయుచు గర్ణపాళిపైఁ
కలకలఁ ద్రోయుచుం దరఁగలౌ ప్రమదాశ్రులు గోటమీటుచుం
జెలిభుజపీఠి నొత్తగిలి చిల్కను దువ్వుచు వాలుఁగన్నుఁ గ్రే
వల కుచధారఁ జేర నొక వారవిలాసిని చూచె రాసుతున్. 67

చ. జిలుగులబెట్టుచుం దొడలఁ జంద్రికపావడ యంట మైతడిం
బెళ పేళఁలేని చీరఁ గటి బింకపుజన్నులఁ జేర్చుకొంచు వే
జలకము లాడి యాడి యొక చాన కరస్థితకేశయై నృపు
న్వెలువడి చూచె లోఁబడితి నీ కని బాసకు నిల్చెనో యనన్. 68

మ. ఒక నేత్రాంబుజ మొక్కఁగల్ల మొక చన్నొయ్యారపున్ లీల వీ
థికిఁ దోఁపన్ దలుపోరఁగా నొకపురంధ్రీరత్న మీక్షించె రా
జకిశోరంబుఁ దదీయలై వెలయు భాషాలక్ష్ములం జూచి త్ర్యం
బకభాగంబు మొఱంగి మైత్రికి శివాభాగంబ యేతెంచె నాన్. 69

మ. కలయం గూర్మిఁ జెమర్చు నంగముల లగ్నంబైన సన్నంపుమం
జులకౌశేయమునందు మించు కమలస్తోమంబుచేఁ జూచెనో
క్కలతాతన్వి చెలంగి పొంగుమది కాంక్షల్ దీఱ మే నెల్లఁ గ
న్నులు గావించి కుమారుజవ్వనము చెన్నుం జూచుచందంబునన్. 70

వ. ఇత్తెఱంగునం గరంగు నంతరంగంబులు గల కురంగాక్షుల యపాంగం
బులం దుఱంగలించు సితేతరతరళదృగ్రోచులభంగశృంగార రసవీచుల
చాలునం బోలెఁ బాదుకొంబడియాలంబిత చీనాంబరప్రాలంబ మాలికాచిత్ర
మ్ములగు నాతపత్రమ్ములు మెఱయఁ బత్రమ్ముల డిగ్గిదుర్గాధిపతు లేమేమయని
త్రోపుత్రోయనాడుచు వీచువీచోపులచ్చమ్ములగు కౌముదీగుచ్ఛమ్ముల సంత
సింపనంతిక పైజకుంతికలం గ్రాలువలుకలంబోలయు చిరుగరువలిందూలు
నీలాలకలయలకలుభయపార్శ్వ సముత్తుంగమత్తమాతంగ మద సౌరభసంగి
భృంగసంఘంబుల నెలయింప నింపారుకలపంబులబ్బాటునం బేటులెత్తి
యొండొరుల యొత్తడిం బాడిపాడియై యొగియు విస్ఫురత ఖురాగపూగంబు
చదల నెల్లెడ నల్లెడగట్టిన ట్టమర దట్టదట్టముగ సాగునాగరుల వాగారవ
మ్ములు నిగుడ నెడవడక పొగడు పొగడికల కలకలమ్ములును పుంఖాను
పుంఖశంఖ భేరీపటహ కాహళ వేణువీణాది వాదనధ్వానంబును గల మధు
రకిన్నరీనిక్వాణంబుల రాణంద్రాణ జెఱుచు విన్నాణంపుఁ గొల్పు టెలుంగు
లును వేల్పు గాణలువాడు లక్ష్మీనారాయణుల కల్యాణంపుఁ బాటలం దీటు
కొన్నతిన్ననిరవంబులుం గలిసి బలిసికొను కోలాహలమ్ము లిమ్ముగ సందడుల
నేచగలుగంజడియు వేత్రహస్త ప్రశస్తతర సాహో నినాదంబు సంబంధించి
కెంపొఱయ నత్యంత కాంతంబయి నిరంతరగతిం గ్రంతనడవ నడదివియలై
మకుటారవిందరాగంబులు వెలుంగ నలుగడలసామంత సందోహంబు క్రందు

కొన మందమందగమనంబునం జను బృందారక వేదండంబుపై నుద్దండచ్ఛాయాకలాపంబు జంబేటి జంబాల కదంబకంబు డంబువిడంబింపఁ దిన్నని రవంబునం గలసి బలసిన కోలాహలంబు హంసాది విహంగహృదయంగమరావంబును బెడంబువడ నడమ క్రంత నత్యంతదర్శనీయంబులై మెరయు మంగళ ద్రవ్యంబుల నెడనెడఁ దీండ్రించు పుండ్రేక్షుదండంబుల కడలఁ గడలు కొను పసరుటాకుల డాలు శైవాలంబు నందంద క్రందుగా మందుచేదివియలు చెందొవలునుం గాఁ బార్శ్వద్వయసముత్తుంగ మణిసౌధవీధికారోదోంతరాళంబున గంధ గజ ఘటాఘనాఘన కాంతిక ఘూళిమాగధ ప్రవాహంబునం గూలంకషంబగు నృపతిపథయమునాహ్రదంబు గగనగంగావగాహనాభ్యాసంబున నిండుకొనిపోవునదియునుంబోలె దనరదనముద్దామ తేజోధరంబునన్ జడిసిన మేరుగిరిమోరులుంబోలెఁ దీరుగలభుజంబులం దాఱుమాఱుగా నిడిన తారతారంపుఁ బంచస్వరంబులుఁ దోరంతహారంబులుఁ గేయూరహీరంబులుఁ గరకంకణ కురువిందకందళంబులుఁ గటికనక మేఖలాఘటితంబగుచాయ కరాచురీమరకతంబుఁ బిడి మెఱుంగులుం దరిసి వెన్నెలక్రొన్నురువులు బోరన న్నగు నరపములు జిలుఁగు కంచుకంబునమించి వెలుపలం దోఁప మంచుగవిసిన రోహణమహీధరంబునుం బోలె రాజభవనాంగణంబు చేరవచ్చె నంత నక్కుడ. 71

క. కాంతాకదంబ కిసలయ
కాంతకరావర్జ్యమాన కనకఘటీ ని
ర్యాంతసుగంధిజలంబుల
నింతి జలకమాడి జిలుఁగు లిడి తడి యొత్తెన్. 72

చ. తళుకు దుకూలకాటిఁ గటిఁ దాల్చి కటీర మలంది హారకుం
డలమణిపారిహార్యరశనాకటకాంగుళిముద్రికాదిభూ
షలు తొడి పారిజాతవికసత్ప్రసవావళిఁ బూని యొయ్యన
న్వెలఁది వివాహవేది కలివేణులు దేఁ జనుదెంచె నిగ్గునన్. 73

తే. ఇట గృహద్వారసీమకు నేఁగుదెంచు
నాకుమారుని కిందీవరాక్షుఁ డెదురు
గని మరుత్కుఱిడిగ్గి వందన మొనర్చు
గతని దీవించి హితమంత్రి యూతమగాఁగ. 74

వ. భూసురాశీర్వాదనాదంబులు రోదసి నిండ నభ్యంతరగృహంబునకుం దోడ్తేని
నంత నప్పు డప్పుడమి ఱేఁ డెడనెడం బుణ్యాంగనలొసంగు నీరాజనోప
చారమ్ములాదరించుచుఁ గక్ష్యాంతరద్వార దేశంబుల మంగళార్థంబు గా
నిడిన పూర్ణకలశ ముకురాదిపదార్థంబులఁ గనుఁగొనుచుఁ దోరణస్తంభాయ
మాన రంభాతరుకిసలయోత్తాలతాళవృంతానిలంబులఁ గుంతలంబులు చలి
యింప మంథరగతిఁ గింపురుష వృషభుండగు గంధర్వరాజు ప్రధానుం
డొసంగు కైదండగొని యల్లనల్లన నడచి పురోహిత బ్రాహ్మణబంధుపురంధ్రీ
సందోహ నీరంధ్రంబయి వైవాహికక్రియారంభ సంభార సంభ్రమద్రంభాది
మరుద్రంభోరువులకలికినునుసోగపలుకుల కలకలంబునం గొలగొల మనుకౌతు
కాగారంబు సొత్తెంచి. 75

చ. ప్రభలు నభోవిటంకమున భానుమరీచులఁ బ్రోదిసేయుఁ గా
స్తుభనిభనూత్న రత్నపరిశోభితమై గరుడాశ్మవేదిక
గ్విభవము పొల్పగుం జవికవిద్రుమపాద సువర్ణపీఠిపై
బ్రభుత దలిర్ప మామ పనుప న్వసియించె ముదంచితస్థితిన్. 76

క. విధివిహితముగ ఖచరుఁ డవ,
న్యధినాథున కొసఁగెఁ బసిడి హరివాణమునన్
మధురమఖభుగ్విదధి
మధురససంపర్కమయిన మధుపర్కంబున్. 77

తే. అంచితాకృతి సాక్షాత్కరించి నట్టి
రమకుఁ బ్రతివచ్చు సురమనోరమ మనోర
మ యనుదాని ననుంగుజామాతఁ గైట
భారిసరి గాఁగ నర్చించి ధారవోసె. 78

క. తదనంతరంబ హర్షము
పొదలు మదిన్ మెట్టుబ్రాల పుట్టికలయెడం
గదియం బట్టిన పెందెరఁ
గదియించిరి బంధుజనులు కన్యావరులన్. 79

ఉ. అప్పుడు తూర్యఘుల్ ఘోరయ నమ్మిథునమ్ము విలోకనస్పృహం
దెప్పలఁ దేల పంపఁ బడు తెల్లనిచీర తెరంగ్రమంబునం
గొప్పు మొగంబు నజ్జు, జను గొండలుఁ దోపఁ లతాంగిపోలెఁ జె
ల్వొప్పతిల న్సుధారసపయోనిధి పెందెరఁ బుట్టు నిందిరన్. 80

చ. కటకరవంబు బోరు కలఁగన్ రమణుల్ తెరచీర వంచినన్
దటుకున రాజు మోమెదుట దారసమైన లతాంగి నేత్రముల్
చటులత లజ్జఁ దల్లడిలె జాలరి చేపలఁ బాసి ధాత్రిపై
నటు నిటు మిట్టి మిట్టుపడు నంబుచరంబులఁ బోలె నత్తరిన్. 81

మ. అవనీశత్రిదశేంద్రుఁ జూపు బరి కన్యాగండపాళిద్వయీ
నవలావణ్యరసంబుఁ గొల్లగొని యంతం జెంత ఫాలంపురా
జు విలోకించి చలించి కైకొనిన యా సొమ్మెల్ల ఘర్మాంబుకై
తన మొప్ప న్వెసడించి తూఱెఁ గబరీ తాపింఛకుంజాంతమున్. 82

ఆ. రాజు చూడ్కి కపుడు రాజీవముఖి చూడ్కి
యెదురుకొనియె లజ్జఁ గొదిగికొదిగి
జడిసి జడిసి జహ్నుసంభవాంభోవేణి
కెదురువెక్కు నీల కోదమనఁగ. 83

మ. తనుమధ్యత్రివళుల్ నటింప నిలమీఁదన్ మట్టియల్ మ్రోవఁగాఁ
గనుపాపల్ పయి తెప్పలం గదియ నుత్కంఠాగ్రయై నిక్కి సా
ధునిమాళిం దలఁబ్రాలు వోసె నవలా దోర్మూలకూలంకష
స్తనవిస్ఫూర్తికి సందిదండలధళిల్ సాహోనినాదం బిడన్. 84

చ. ముడివడు కంకణప్రభల ముత్తెపుసేసలు దోయిలించి యా
త్తెడుపతి బాహుమూలరుచ దీప్తులపైఁ బతిదృష్టి పర్వినం
బొడమిన లజ్జఁ రాణి యొగమున్ వెసవంచి య మౌళిమీఁగి కై
పొడవున జల్లె లేనగవు పొల్తుక తెప్పల నప్పళించుచున్. 85

క. సకల క్ష్మాపతి యిడఁ గొ
మ్మ కచంబులనుండి రాలె మౌక్తికములు సా
త్త్వికజనితగండఘర్మాం
బు కదంబాసారగరిమఁ బునరుక్తములై. 76

క. పతి సతిపైనిడు ముక్తా
వితతి పడం దొడఁగె వడి భవిష్యత్పురుషా
యిత నిర్దయరతిరభస
చ్యుతసితకబరీప్రసూన సూచకమగుచున్. 87

శా. కట్టె న్మంగళసూత్రమున్ శరధిశంఖశ్రీలకున్ బొమ్మలం
గట్టం జాలెడు కంఠపీఠ నిఖిల క్ష్మాభర్త కోణద్యుతుల్
దట్టం బైనఖకోరకోత్కరము తద్గ్రైవేయ హైమస్ఫుర
త్పట్టస్థాపితపద్మరాగముల పంతంబుల్ విడంబింపఁగాన్ ! 88

క. అట్టియెడఁ బెండ్లిపనులన్
దిట్ట లగుపురంధ్రు లచట నిలిపిరి వహ్నిం
బెట్టిరి మణిపీఠ సురి
పట్టముపైఁ బఱచి రందుఁ బతియున్ సతియున్. 89

క. ఆశుద్విజహుతహరితశ
మీశాఖాశకలనినద మేదురవిశదా
భీశుజ్వాలాజాలహు
తాశక్రోడమున వ్రేల్చి రాహుతు లెలమిన్. 90

తే. తోయజామోదలాజలు దోయిలించి
ప్రమదమున వేల్వనొకకొన్ని చెమటనంట
వ్రేళ్ళ గనుపట్టెఁ గెంజాయవీతిహోత్రు
నాలుకలు సాటి రావన్న నవ్వెనఁగ. 91

తే. స్తనగుళుచ్ఛవధూదేహ దాడిమీ ల
తామతల్లికపై హోమ ధూమమడరె
భర్త నభిమత రతిమహా ఫలవిపాక
మగుటఁ గోర ఘటించు దోహద మనంగ. 92

మ. జగతీనాథవతంస మానతశిర స్సమ్మేళనన్ నెయ్యపుం
జగడంబుల్ ప్రియ మొప్పమాన్పడు తఱిం జంచత్కిరీటాగ్ర ర
త్నగణస్పర్శసహంబు గావలసియో నాకోర్కి దైవాఱ న
మ్మగువం బాదతలంబు వట్టి సనెకల్ మట్టించె మోదంబునన్. 93

క. కడు నవ్వించుచుఁ బెఱఁగులు
ముడి వెట్టెన్ బేరఁటాండ్రు ముదితకనుబొమల్
ముడివెట్టె నాలి సిగ్గున
ముడివెట్టెన్ నార చెఱఁగు మోమున మరుడున్. 94

సీ. పరిణమించిరి ధరామర పురంధ్రీహస్త
ఘటితచేలాంచల గ్రంధికలనఁ
బరిపూర్ణనిష్ఠఁ గొల్చిరి ప్రదక్షిణపూర్వ
వినతి నాలుకలార్చు వేఁడివేల్పు
వీక్షించి రుడువీథి నక్షీణసుస్థితి
స్థాయిఁ దోషిత రమాధవుని ధ్రువుని
బరిణయ ప్రాప్తసప్తర్షి ప్రీత్యపేక్ష్య
సాక్షాదరుంధతీ సతి కెరఁగిరి

గీ. సకల సంయమి గణ నమస్కరణకృత్య
మాచరించి తదీయహస్తాభిమంత్రి
తాక్షతలు మౌళిఁ దాల్చి రత్యాదరమున
దంపతులు బంధుకోటియుత్సవ మెలర్ప. 95

ఉ. కూరిమిమంత్రితోడ నలకూబరుఁ డేకత మాడి పెద్దబం
గారపుఁ గోరఁ గల్పవని రాజనికాంతము లైనచీరలున్
హారవిభూషణావళియు నమ్మిథునంబునకుం బ్రియంబుతో
నారదమౌని చేత నదనం జదివించెఁ గుబేరు పేరుగాన్. 96

క. కలిమి మెఱయంగ మఱియుం
గల బాంధవు లొసఁగి రపుడు కాంచనమణిభూ
షలుఁ జీరలు నరపతికిం
బొలఁతికి నుడుగరలు ముదము పొదలఁగ నంతన్. 97

సీ. పొగడపూవంటి కంపులమదాంబువులును
మధువర్ణదంత శంబములు మెఱయ
భీకరస్వరచారు బృంహితంబులు ఘనాం
గారకగ్రహకాంతి కన్నులమర
నిలఁజాట్టుకదు తొండములు నించు పూర్వాంగ
మెత్తకంబై పిఱుం దత్తవిల్ల
గటము లుత్కటము లై నిటలకుల్ బటువు లై
సిబ్బెంపు మొగముల నుబ్బుమీఱ

గీ. స్వర్ణకక్ష్యాంచలత్ప్రాస శరధికాఙ్గ
ఖేటకధ్వజఘంటి కాద్యలం కృతులఁ జెలువ
మెసఁగు గంభీర వేది భద్రేభశతము
నల్లునకు నిచ్చె గంధర్వ వల్లభుండు 98

శా. ఉర్వీజానికి మామ యిచ్చె శిఖిపింఛోద్భాస వర్ణంబుచే
నర్వాచీన ఘనాళి రోహితసహస్రాకీర్ణగా మింటఁబూ
పార్వస్తోమముఁ జిత్రయానముల నూటాడించు గాంధర్వగం
ధర్వవ్యూహము దీప్తచండమణి కాండస్వర్ణసన్నాహమున్. 99

క. తళతళని తఱచి మెఱుగులఁ
దళతళ మను మణులు మెఱసి తలఁచినచోటన్
నిలుచు విమానము ఖేచర
కులతిలకుఁడు కూర్మి పెండ్లి కొడుకున కొసఁగెన్. 100

వ. మఱియు రజత మహారజతశయ్యాసన భాజన డోలాకలాచికాఘట కటాహ పీఠికాపేటికాది గృహోపకరణంబులును, మరకతకురువింద పురుష రత్న పురంధరమణిమౌక్తికాది మహారత్నఘటిత కటక తులాకోటి కంఠికాంగద హారావళీ కాంచి కోటీరకాది కలాపఁ లాపంబులును, విచిత్ర నేత్ర పేశల కౌశేయ చీనాంశుక పట్టంబులం బెట్టిఁబెట్టి పెట్టియలును, అమూల్యాగరు మృగమదసంకుమదకుంకుమ పటీర కర్పూర హిమాంబుపూరంబులు దట్టపునుంగునగరువత్తును మంచిగందవొడి చాఁదుదట్టుభాస్వరంబు లోనుగాగల పరిమళ ద్రవ్య సంభారపరంపరలును, జవ్వనంపుఁ గ్రొవ్వునఁ జివ్వటిల్లి ముఖ్యంపు వాతెఱలు విప్పవవ్వనుసోగ వెన్నెలలం గలసిపిసాళించు చంచల దృగంచల ప్రభలం బచరించి మెఱుంగుఁ జన్నులఁ గన్నెతమ్మిమొగ్గలవన్నె వటమటించి వెన్నెఱుల మెఱుంగుఁదుమ్మెదవన్నెఁ దటమటించి వెన్నడుముల విన్నువెన్ను దన్నివటువు మిగిలి విటనికాయంబు రాయిడింబడి పుటపుటనైన తూలంకపచాటువుల మాటకారితనంబు మెఱసి నాగరికపుఁ బనుల గరగరికలం గళరవచ్ఛలాలాపాచరణంబుల రవణంబుల మిసమిసలఁ బసగలిగి కేలిమైన కలుకులరసికజనంబుల మనంబుల మరులుకొలుపంజాలి కురచిరాభరణ భూషితంబగు పరిచారికా సహస్రంబును గూఁతునకు నరణంబుగా నిచ్చిమఱియును, 101

సీ. అతనతాంగుష్ఠాగ్ర హార్యనిర్యద్రత్న,
ఖనిఘనాంతరితశృంగాటకములు
మదముదావహదివ్య మైరేయధారేయ
గోత్రభిద్విటపి నిష్కుటయుతములు
మహిళాకదంబ డింబగ్రాహ్యగృహచర,
న్మృగనాభిసౌరభ్య నిర్భరములు
ప్రఖరాఖునఖరధారావిదీర్ణోదీర్ణ,
సౌవర్ణమృత్కీర్ణజాంగలములు

గీ. కోకకలహంసముఖరితాబ్జాకరములు
సిద్ధచారణగంధర్వ సేవితములు
మందరద్రోణిఁ గొన్ని గ్రామములు కూర్చి
తనయ వసువున కొసఁగె గంధర్వవిభుఁడు. 102

తే. పారయాత్రికసురసిద్ధ చారణాహి,
యక్షగంధర్వసాధ్య విద్యాధరులను
నిజపురంబుల కనిచె నిం దీవరాక్షుఁ
డుడుగర లొసంగి విభవంబు గడలుకొనగ. 103

వ. అనిన విని జైమిని మునీంద్రుండు మీఁదటివృత్తాంతం బానతీయ వలయు
నని యడుగుటయును. 104

శా. అతులక్షాంతి గభీర ధీరహిత చిత్తాంభోజభోజక్షమా
పతివిద్యాపరిపాక పాకరిపుదంభద్భోగ భోగాశివ
త్రితరస్ఫూర్త్యనుభావ భావభరిత శ్రీకాంత కాంతార పా
లిత కాళింగ దళేశ లేశతరవృత్తి క్షీణవైరివ్రజా 105

క. నాగాంబాసుత జితకద,
నాగతమదనాగసంగ మానూనగృహా
భోగా భోగపురందర,
భోగీంద్రశయాన పురుష పూజాప్రవణా 106

**మాలిని.**

సరభసజయధాటీ చండ వేదండకోటీ
శరవమధుహిమానీ కంపితాశావధూటీ
పరమహితహాసంతీ భావభాగ్భూరి తేజః
పరుషదహనకీలా ప్రస్ఫురచ్చక్రవాళా. 107

ఇది శ్రీమదాంధ్ర కవితాపితామహ సర్వతోముఖాంక పంకజాక్ష
పాదాంబుజాధీన మానసేందిందిర నందవర వంశోత్తంస
శఠకోపతాపస ప్రసాదాసాదిత చతుర్విధకవితామతల్లి
కాల్లసాని చొక్కయామాత్యపుత్ర పెద్దనార్య
ప్రణీతంబయిన స్వారోచిష మనుసంభవం
బను మహాప్రబంధమునందుః
బంచమాశ్వాసము
సంపూర్ణము.

శ్రీ

# స్వారోచిష
# మనుచరిత్రము

## షష్ఠాశ్వాసము

శ్రీకృష్ణరాయమనుజేం
ద్రా కాంతాపంచబాణ నరసింహాఘరి
శ్రీకాంతగర్భవార్నిధి
రాకాహిమధామ కందర్ప దళవిరామా.

వ. అవధరింపుము శకుంతంబులు బాదరాయణాంతేవాసి కిట్లనియె నంతనొక్క
నాడు. 2

సీ. పాండురప్రభఁ గ్రిందు పడిన చీఁకటివోలె
జిగి నొప్పు నీలంపు జగతి మెఱసి
యౌన్నత్యమున మ్రింగినట్టి నింగులుగ్రక్కు
కరణి ధూపము గవాక్షముల వెడల
ధారుణీసతి సుగంధ ద్రవ్యములు దాఁచు
నరలపేటికవోలెఁ బరిమళముల
నెలవులై చెలువారు నిలువుల విలసిల్లి
కోణిగఁ బారావత కులము పదరఁ

గీ. పసిఁడిరేట లిఖించిన ప్రతిమ లమర
నీఁగ వాలిన నం దంద యొలుఁగులొసఁగు
నట్టి సకినలమంచము లాదిగాఁగ
మెఱయు పరికరముల నొప్పు మేడమీఁద. 3

క. రమణునికడ కనుప మనో
రమణిన్ మజ్జనముదీర్చి రసరవకచ
భమునకుఁ గాలాగరుధూ
పము వెట్టి జవాది నంటు వాపి నిపుణతన్. 4

సీ. చెంగల్వపూదండ సేర్చి పెందురముపై
ఘనసారమున సూసకము ఘటించి
పన్నీటితోఁ గదంబము చేసి మృగనాభి
బూసి కుంకుమ సేస బొట్టుతీర్చి
విశదముక్తాదామరశనఁ జందురకావి
కలిపపువలువపై నలవరించి
యుదుత వెన్నెలగాయుహార మొక్కటిపెట్టి
మణులసొమ్ములుమేనమట్టుపఱిచి

గీ. కన్నుఁగవ గెల్చి డాకాలఁ గట్టెవనగఁ
ఘల్లుఘల్లునఁ బెండెంబు గండుమీలు
గదల నల్లన నడిపించి పొదివి తెచ్చె
నెచ్చెలులపిండు యువతి నానృపతికడకు. 5

క. తెచ్చుటయుఁ గేళిభవనముఁ
జొచ్చెనొ చొరదో యనంగ సుదతులనీడం
జొచ్చిపయిఁ గొప్పు దోఁపఁగ
నచ్చేడియ తలుపుదండ నల్లన నిలిచెన్. 6

క. తదనంతరంబ బోటులు
చదురుల నగవులను బ్రొద్దు జరిగినఁ గేళీ
సదనము నొక్కొక్క పనినెప
మొదవఁగ వెడలుటయుఁ జిత్తజువ్యాపారన్. 7

సీ. దట్టంబు నీకట్టినట్టి చెంగావికిఁ
బాగు గాదని కేలఁ బయఁట నిమిరి
గోరంటా గోళ్ళనిక్కువపుఁ గెంపో యని
చెయిపట్టి నయమున సెజ్జఁజేర్చి

నగరుధూపముచేత నయ్యోగ్యతనూవల్లి
పొకపోఁక నని యెదఁ జెయ్యిపెట్టి
మృగనాభికామకరికలఁ గ్రమము మించె
నని మూరుకొనుచుఁ జుంబనమొనర్చె

గీ. హారమణు లిటునూపు నా యంటినున్న
హారమణులకు గాంతి నీ డౌనొ కావొ
యనుచు నక్కునఁ గదియించు నా నెపమునఁ
గంపమును బొందు సతిమేను గౌఁగిలించె. 8

వ. అట్లు గవియం దమకించి త్రస్తయుఁ గుస్తరింప నింపు గలిగియు మునుమున్న మనంబునం బొడమియుండు నడలప్పుడు తలంపునం బొడమిన సమర్థుండగు నతనిచేనది తీర్పించుకొనం గలయదియైనపోఁథ గావున మాటలం దేటపడం జెప్ప శంకించి స్త్రీస్వభావంబునం దోరఁగు కన్నీరు కంకణ కంకృతులుమీఱ గోరఁ బాఱ మీటుచుం నూరకయున్నం గనుంగొని యవనిపతిపుంగవుం డంతరంగమునఁ జెంగలించు కౌతుకాంతరంబు కరఁగుపడ వెఱఁగుపడి యుద్వేగసమన్వితుండై సంభ్రమించుచుఁ జెక్కుటద్దంబులు నొక్కి కురుల చక్కం ద్రోయుచుం దోయజాక్షి యత్యయానంద సంధాయకంబగునిట్టి క్రీడాసమయంబున నగపునకుం గారణంబేమి నాయెడం గల్ల యేమేనియుం బాటిల్లదుగదా యెవ్వరే మప్రియంబు గావించి రెఱింగింపు వారిం దండింతు నదేమి సాధింపవలయుఁ జెప్పు మది వేఁగచేసున్న సాధింతు మదీయంబులగు నరజీవితంబులు భవదధీనంబులు మ్మలికయింత యేటికనుటయును బోటి గ్రేటుచునిట్లనియె. 9

ఉ. అక్కడ నాయెడ న్మిగుల నక్కరగల్గి చరించు నెచ్చెలుల్
చిక్కి మునీంద్రశాపహతిఁ జెందిన దుర్దమరోగబాధలం
బొక్కుచు నున్నవారు వన భూములఁ దద్దశ మాన్పవేని నా
కెక్కడిసౌఖ్య మన్నఁ దరళేక్షణఁ జూచి స్వరోచి యిట్లనున్. 10

క. పరితాప మింక నేటికి
హరిణాక్షి మదీయసంచితాయుర్వేద
స్ఫురణమునఁ బరిహరించెద
వరు దనఁగ భవత్సఖీ జనామయభరమున్. 11

క. నా వెనుకరమ్ము నీసఖు
లీ వనమున నున్నవార లిపుడు చికిత్సం
గావింతు ననుచు రయమున
నావనితయుఁ దాను నచటికరిగియొక యెడన్. 12

ఉ. ఆరజనీశబింబరుచి రాస్యలఁ గాంచి తదామయవ్యథా
భారము మాన్పఁగా దమి నృపాలుఁడు తత్కులధాతగోత్రకాం
తారపదంబునం దుపచితం బగుమందును దెచ్చి యోచితా
హారము నిమ్మ నిచ్చమున నామయదూర్యలఁ జేసె వన్నెగాన్. 13

శా. ఆ దివ్యౌషధరాజిచేఁ దమమహావ్యాధివ్యథల్ దీఱినన్
మోదం బంది లతాంగు లంబుజదళంబున్ నవ్వ్యాకఁదోయితో
సౌదామన్యభిరామదేహరుచితో సంపూర్ణ చంద్రానన
శ్రీదర్పోన్నతితోఁ జెలంగి సుర నారీసూనుఁ గీర్తించుచున్. 14

క. మా కుపకార మొనర్చితి
నీకుం బ్రతిసేయు నెట్లు నేయుతు మైనన్
లోకోత్తర మాకళలను
జేకొను కార్యములఁ గలవు చెప్పెద మెలమిన్. 15

క. మును మాదగువృత్తాంతము
వినిపింపఁగవలయు నీకు విశ్రుతముగ భూ
వినుత విను మనుచు నందొక
వనజేక్షణ పలికె మధుర వాగ్జితశుకయై. 16

తే. అనఘ మందారవిద్యాధరాత్మభవను
నను విభావసియండ్రు గంధర్వవరులు
తెలిసియుండుదు నిమ్మహీతలమునందుఁ
బరగు మృగపక్షిజాతుల భాషలెల్ల 17

క. అమ్మేటివిద్య నాచే
నిమ్ముగ నంతయును నొసఁగి కృప నన్ను విభా
సొమ్ముగ మనవుకు రెండవ
కొమ్మ మదిం బ్రేమ గడలుకొన నిట్లనియెన్. 18

ఆ. పాఱఁ డనగఁ బరఁగు బ్రహ్మర్షి మా తండ్రి.
యతఁడు విద్య లెల్ల నభ్యసించి
తపము నిచ్ఛఁ జేయఁ దలఁపోసి కీరభృం
గాలిరమ్య మైన యాశ్రమమున. 19

మ. ఫలమూలచ్ఛదనాంబు భుక్తిఁ బవనాభ్యాస క్రియాయుక్తిని
ర్దళితాంతర్గత శాత్రవప్రకరజాగ్రద్గర్వసర్వస్వుఁడై
చలికిన్ వానకు నెండకును మన మనుత్సాహంబు గానీక కం
దలితానందమునన్ ముకుందచరణ ధ్యానావధానంబునన్. 20

క. అంగుష్ఠము నిలమోపి ప
తంగునిపైఁ జూపు సాఁచి ధగధగ లర్చి
స్తుంగత నింగులు నా కెడు
నింగలములు నాల్గుదెసల నిడుకొని కడకన్. 21

క. సుర గరుడ యక్ష రాక్షస
నర కిన్నర సిద్ధ సాధ్య నాగోత్కర మి
ట్లురు దనఁగఁ దప మొనర్చెం
బురుహూతుఁడు దాననాత్మఁ బొడమిన భీతిన్. 22

క. తనయొద్దఁ బుంజికస్థల
యను నచ్చర లేమయున్న నమ్మునికడకుం
జనుమని యనిపిన పతిశా
సనమున వని కేఁగు దెంచె సంభ్రమలీలన్. 23

చ. చిలుకలు ముద్దుఁబల్కులకుఁ జేరఁగరా నెఱివేణి కాంతికిన్
మలయుచుఁ బైపయిన్ మధుపమాలిక వాయక సంచరింపఁగా
నలసవిలాసయానమున నమ్మునిపాలికి వచ్చె వేల్పుఁదొ
య్యలి నునుసానఁబట్టిన యనంగుని మోహన బాణమోయనన్. 24

వ. ఆ సమయంబున 25

చ. అనువగు సుళ్ళ నొప్పు మలయానిలవాహము నెక్కి తేంట్ల న
ల్లిన నిడువాగెఁ బూని లవలీ నవవల్లిక లెమ్మెసొమ్ములై
కనుపడఁ జెట్లువట్టి మను ప్రాతదళమ్ములతోడఁ దోలె నా
మునివరు మంచురాజు మడి మంచగఁ గోయిలగంట మ్రోయఁగన్. 26

సీ. సానదేఱి పాటమరించి నెఱెవానినయట్టి
యాకురాలుపు గండ్లయందుఁ దొఱఁగి
యతిబాల కీరచ్ఛదాంకు రాకృతిఁ బొల్చి
కరవీరగోరకగతిఁ గ్రమమున
నరుణంపు మొగ్గలై యరవిచ్చి పికిలి యీఁ
కలదండలట్లు గుంపులయి పిదప
రేఖలేర్పడఁగ వర్ధిలి వెడల్పయి రెమ్మ
పసరువాఱుచు నిక్కుఁ బసరుకప్పు

గీ. పూఁటపూఁటకు నెక్కుఁగప్పానకుఁ
దగిన మెఱుఁగు నానాటికినిమీద గిఱికొనంగ
సోగయై యాకువాలంగ జొంపముగుచుఁ
జిగురుదళుకొత్తెఁ దరులతాశ్రేణులందు. 28

క. హిందోళంబునఁ బాడిరి
బృందారకసతులు విరహిబృందార్తిగఁ ద్రేఁ
చెం దేటులు వాసంతిక
విందునఁ బిక శిశువు దాది వెడలం దోలెన్. 28

సీ. చలిగాలి బొండుమల్లెలపరాగము రేఁచి
నిబిడంబుసేసె వెన్నెలరసంబు
వెన్నెలరస ముబ్బ వెడలించె దీర్ఘికా
మందసౌగంధిక మధునదంబు
మధునదం బెగఁ బోసె మాకందమాలికా
క్రీడానుషంగిభృంగీరవంబు
భృంగీరవం బహంకృతిఁ దీఁగ సాగించెఁ
బ్రోషితభర్తృకా రోదనముల

గీ. విపినవీథుల వీతెంచె గుపిత మదన
సమదభుజనత సుమ ధనుష్టాంకృతములు
సరసమధుపాన నిధువనోత్సవ విలీన
యువతియువకోటికోరికల్ చివురులెత్త 29

క. అత్తఱి మారిపునడఁ జెలి
కత్తియగమి గొలువ మృదుల కలభాషలఁ ద
ళ్కొత్తెడు వెడనగవులతోఁ
జిత్తభవుం డార్వనలు చిదుము నెపమునన్. 30

చ. అలకనుజీబులోఁ గుసుమ మద్దిన పావడ వోఁపఁ గొప్ప చెం
గలువల వల్వ జన్నుఁగవ కస్తురి తావియుఁ బ్రస్తరింప నం
దెలరొద మీఱఁ బెన్నిధిగతిన్ బ్రతికిం బాడకట్టె వేల్పుదో
య్యాలి చిఱుసానఁ బట్టిన యనంగుని మోహనబాణమో యనన్. 31

తే. అత్తెఱంగున నదరిపాటూరజంపు
వన్నెఁ బాడకట్టి తాఁ బాడు సన్నరవళి
పాట లళిఝుంకృతి శ్రుతిఁ బాడుకొనఁగ
జూడకయ చూచు చూపుతో సుడియుటయును. 32

చ. తలకొని దానితమ్ములపుఁ దావియు మోవియుఁ గాను మేను న
గ్గలపు మెఱుంగు లీను తెలి గన్నులు జన్నులుభృంగమాలికన్
గెలిచిన యారుతీరుఁ దగు నెన్నడలుం దొడలున్ వివేకముం
గలఁపగ గాంచి పంచశర కాండవిఖండిత ధైర్యసారుడై. 33

క. మేను గరుపారఁ దమిన
మాని జపముఁ దపముఁ దన్ను మఱచి యనంగ
గ్లానిఁ బడి కదిసి వడఁకుచు హీనస్వర
మొసఁగఁ బ్రోవవే నన్ననుచున్. 34

తే. చెయ్యి పట్టినమాత్రాన శిరసి వంచి
యవశచందానఁ బైవ్రాలు నవ్యఘూటి
బర్ణశాలాంతరముఁ జేర్చి బ్రాహ్మణుండు
కెరలుకోర్కులఁ గందర్పకేళి దేలె. 35

క. తపమంతయుఁ బాలివోవఁగ
నపుడన్నియు నుజ్జగించి యయ్యంగనతో
దపని మనోజక్రీడా
విపులైశ్వర్యంబు అనుభవించుచు నుండెన్. 36

క. ఈరీతిఁ గొంతకాలం
బారామ మహామహీధరారణ్యములం
దారామఁగలలఁ దగిలి వి
హారము సలుపంగ గర్భమైతి యగుగున్. 37

క. అంత నను గాంచి యది విపి
నాంతరమున బాఱవైచి యరిగెఁ గృపార్ద్ర
స్వాంతుఁ డగుసంయమీంద్రుడుఁ
జింతింపక బోయె నేమి సెప్పుదు నధిపా. 38

వ. అట్లు వైచి చనుటయు నాఁకటం గటకటం బడుచుండి తీండ్రించుచు శశిమండలంబున వెడలుశిరకిరణప్రణాళికామిళదమృతరసగ్రాసంబునం జేసికొన్ని పూటలం బుటపుటనైన నన్నుం గనుంగొని మునీంద్రుండు ప్రియంబందినిజాశ్రమంబునకుం గొనిచని శశికళాసంవర్ధితనగుటం జేసి నాకుం గళావతియను నామం బిడి పెనుచుచుండ నేనును జనకసేవాపరతం బ్రవర్తిల్లుచుండు నంత. 39

ఉ. ఆసమయంబునం బొగులు చాఁకటి పెల్లున నంతకంతకున్
గాసిలి పైపయిన్ వదన గహ్వర మెండఁగ నేడ్చి యేడ్చి యే
మాసయుఁ గాన కంత దుహినాంశుఁడు దోఁచినఁ దత్కళారస
గ్రాసవిధిన్ శరీర మమరంగ భజించితి దైనికంబునన్ 40

సీ. ఏ నవ్విధంబున మేను పెంచుచునుండ
నాచంద మంతయు నాత్మ నెఱిగి
కడుసంభ్రమమున నక్కడకు నేతెంచి యిం
పెసఁగ మైనిండిన కసటుదుడిచి
తనయురంబునఁ జేర్చుకొని పోయి యాశ్రమ
స్థలమున నిజపర్ణ శాలనునిచి
విధుకళాంశాహార విధి వసించితిఁ గానఁ
నాకుఁ గళావతీ నామ మొసగెఁ

గీ. నయముమీఱంగఁ బెనుప నానాఁటఁ బెరిగి
శైశవముమాని యౌవనోత్సవము జెంది
జనకు నేమైన నడుగుచు సంతతంబు
నోపి శుశ్రూష చేయుచునున్నచోట. 41

క. ఎవ్వరు చూచిన జూపుల
చివ్వకుఁ బద నడఁగి నడచు సిగ్గున నొఱపై
రవ్వకు మొదలగు పాపపుఁ
జవ్వన మెదిరించె జిగియొసగ నామేనన్. 42

శా. ఆవేళం బాడఁ గాంచి ఖేచరుఁ డొకం డాసక్తి దేవాపి సం
జ్ఞానంతుండు సభాంధవుండగుచు నిశ్శంకన్ ననున్ వేడువా
డై వాచంయముఁ డగ్ని కార్యనిరతుండై యున్న చోఁ బర్ణశా
లావాసంబున కేఁగుదెంచి నిజభావాకాంక్షసూచించినన్ 43

సీ. శిఖిపింఛదళపరిష్కృతములై సేమంతి
విరుల తీరగుశిరోవేష్టనములు
నెఱగంటిచూడ్కిఁ దాయెతులబాహులు వంచి
నారాజులల్లార్చునారజములు
గాదంబరీగంధ గర్భంబులై వల్చు
ఘనసారమిళి దాస్య గంధములును
దరహాసములఁ దోచుఁ దాంబూలసేవాంధ
కారితాధర రదక్షితులయొఱపుఁ

తే. జిటులు గంధపుఁబూఁతలు జిహ్వాకలవు
ననుపు నెఱవాది బంటుపంతపుఁ బదరులు
ఘనమగుజుగుప్స వెనుప నజ్జనముఁ జూచి
ఋషి మనంబునఁ గడు నసహ్యించుకొనుచు 44

శా. ఆహా ధన్యుడనైతి మద్విమలవంశాచారవిద్యాతప
శ్శ్రీహోమాదులు నేఁడుగా తుది ఫలించెన్ నాగవాసంబు మ
ద్గేహక్షోణికి బిడ్డ వేఁడుటకు వే తేఁ గాంచుటన్ బ్రాహ్మ్యమిం
కోహో! చాలు బొకాలిపోయెదరొ పోరో నోటిక్రొవ్వేటికిన్. 45

క. మీతరమువార లేతఱి
నేతరితినమునఁ దపస్వి గృహకన్యకలన్
వీతభయవృత్తి వేఁడిరొ
కోతముఁ దర్కింప కౌర క్రొవ్వు లటంచుని 46

క. వసుధేశ ముఖ్యుడున్నన
పసరముక్రియఁ గరలి తిట్టెఁ బక్కన ఋషి వా
రుసురు మని వెడలిపోయిరి
ముసలిగదా పుట్టినిల్లు ముఖ్యోష్ణతకున్. 47

వ. అట్టియెడం దనమనోరథంబు విఫలం బగుటకుఁ గ్రోధాంధుండై నన్నఖిల
షించు గంధర్వుం డిట్లనియె. 48

శా. నీవై శిష్ట్యము తిట్టులన్ స్మరయునే నీకంటె నేఁ దక్కువే
యీవే కన్యక నీవు గాక మఱి మద్వృత్తాన్వయాచారముల్
నీవా పేర్కొనుపాటివాఁడ విలగా నీ నిల్తుగా కేమి పో
పో విప్రాధమ నిన్నుఁ బోల నిక నల్పుల్ లేరు దంభవ్రతా. 49

తే. అనుచుఁ బగచాటిపోయినాఁ డర్ధరాత్రి
సమయమున శస్త్రనిహతిమజ్జనకుఁ జంపె
నట్ల యగుగాక పుడమిఁ గామాంధచిత్తు
డెవ్వరివధింప డెటుసేయఁ డేమిగాడు. 50

తే. అపుడు మెడ గోయ మునిరోజు టాలకించి
మేలుకొని దివ్వె యిడి సంభ్రమించి యేడ్చు
నన్నుఁ బొదివిరి పొరుగిండ్ల నున్నతపసు
లాదురాచారుఁడును బాఱె నటకు మునుప. 51

వ. అంతం దెల తెల వేగుటయుఁ బ్రభాతసమయంబున. 52

క. ధారాళక్షతజోక్షిత
ఘోరజరాధవళి తోరు కూర్చముగఁ గరా
చారిని మెడ దెగియుంట జా
గారంబునఁ బడిన మూఁడు గాళ్ళ ముసలికిన్. 53

ఆ. అగ్నియిచ్చి యకట యాబాల్యముగ నన్నుఁ
బెనిచె దల్లివైచి చనినపిదపఁ
దానె తల్లిమాఱు నై నెమ్మినట్టిఁ మ
జ్జనకుఁడీగ్గె నేటి మనికి యనుచు. 54

క. వందురి వగలన్ దేహము
పొందెడలఁగ జూచు నన్ను బాడగని దివి దా

కొందుల కేగుచునో గిరి
నందన దిగి వచ్చి కరుణ నాకిట్లనియెన్. 55

మ. అతిసౌందర్యనికాంత మీతను వలభ్యం బిట్లు శోకాతురా
న్వితవై దీని దొలంగ గాఁ దగునె తన్వీచాలు నీసాహసం
బతిలోకుండు స్వరోచి నీకు బతియౌ నారాజుఁ జేపట్టి య
ప్రతిమ శ్రీవిభవంబు గాంచెదవు నా పల్కొండుగా నేర్చునే? 56

క. విను మదియుఁ గాక పద్మిని
యనఁ బరగిన విద్య నేఁ బ్రియంబున నిత్తుం
గొను నీవు తత్ప్రసాదం
బున నీకు నభీష్టసౌఖ్యములు సిద్ధించున్. 57

వ. అని రహస్యంబుగా నవ్విద్య నాకు నుపదేశించి ముక్కంటివాల్గంటి మింటి
చొప్పునం జనియె. నేనును తద్వచనామృతా స్వాదనంబ యూఁతఁగా
బ్రాణంబులు పట్టుకొని యున్నదాన. నాస్వరోచి నీవ కాఁ దలంచెద.
వంచనాలాపంబులుడిగి యప్పద్మినీ విద్యారత్నంబుతోఁ గూడ నన్నుం
బరిగ్రహింపు మనిన నంగీకరించి యమ్మహీవిభుండు. 58

క. ఏకాగ్రత నవ్విద్యలు
గైకొని పుణ్యాహపూర్వకంబుగా గుణర
త్నాకరుఁ డయ్యిద్దఱ న
స్తోకోన్నతిఁ బెండ్లియయ్యె సుముహూర్తమునన్. 59

ఉ. ఆసమయంబునన్ మొరసె నభ్రపథంబున దేవదుందుభుల్
సేసలు చల్లి రచ్చరలు సిద్ధనికాయము చేరి సన్నుతుల్
సేసెఁ బ్రసూనవృష్టి గురిసెన్ జనరంజనకారివాసనో
ల్లాసములై చెలంగె శుభలక్షణదక్షిణగంధ వాహముల్. 60

క. ఈవిధమున నుద్వాహం
బై వేలుపు వెలఁదిపట్టి యంచితమతి న
ప్పూవుంబోఁడులు మూవుర
తో వివిధవిహార సంగతులఁ దత్పరుఁడై. 61

సీ. గంగాతరంగిణీరంగత్తరంగశీ
కరశీతసైకతోత్కరములందు
మందారమాకంద మకరందతుందిలేం
దిందిరానంద కృన్నందనములఁ
గాంతనిశాకాంత కాంతవితర్ది కా
క్రాంతభూభృద్భృంగ కందరముల
మసృణబిసాహార మాంసలహంసికా
సంసదాసారకాసారతటుల

తే. దమక తమక ప్రియుండని తమత మెసఁగఁ
బడతులుప్పొంగఁ గ్రీడించె బద్మినీ ప్ర
భావఘటితాన్న పానభూషావిశేష
మాల్యవస్త్రానులేపసామగ్రిఁ జెంది. 62

మ. అరవిందాక్షులు దాను నిట్లభిమతవ్యాపారముల్ సల్పుచున్
ధరణీశుం డొకచోట గాంచె లఘుశీతస్వచ్ఛవాఃపూరమున్
వరకీరవ్రజచంచుపాటితతటవ్యాకీర్ణమందారకే
సరమాకందవిస్సరత్ఫలరసాస్వాదంబుగాసారమున్. 63

క. కని తత్తటసలిలంబునఁ
ననుమతి విహరించె సవిధ హరిహయవరనం
దననందన హరిచందన
వనపవనార్భకవినోద వశగతుఁ డగుచున్. 64

ఉ. అందొక యంచలేమ గహనాని లసంచలదూర్మిమాలికా
మందవిహారసౌఖ్యమున మత్తిలి దవ్వులనున్న చక్రవా
కిందగఁ జేరఁబిల్చి పరికించితె యెంతతపం బొనర్చి రీ
యిందునిభాస్యలుం బతియు నేకమతిం గవగూడి యుండగాన్. 65

క. మెలఁతకు బతిపై నైనను
మెలఁతుకపై బతికినైన మేలగు టెందున్
గలయది మెలఁతకు బతికిన్
వలపు సమంబగుట జన్మవాసన చెలియా. 66

ఉ. కావున వీరియందు నధికం బగుకూరిమి గల్గియుండు నీ
భూవలయాధినాథునకుఁ బోల్పఁగ నీవిభునందు నగ్గలం
బీవనజాయతాక్షులకు నిచ్చఁ బ్రియంబది గాన పూవునుం
దావియుఁ బోలెఁ జాలఁ బ్రముదం బొనరించిరి నాకు నెచ్చెలీ. 67

వ. అని పలుకు నమ్మరాళలోలనయనపలుకు లాలంబుచేసి చక్రవాకియిట్ల
నియె. 68

చ. మదమున నమ్మహీశుఁ డొక ముద్దియ చూడఁగ నొక్క కాంతతో
సదమదమై కడంగిరతి సల్పుట తెల్లమిగా నెఱింగియున్
మదివివరించి రోయ కభిమానము దక్కిన వీరికూరుముల్
వదలక పెద్ద నేసెదవు వందిగతిన్ దగ నీవిచారముల్. 69

చ. పలువురయందు నొక్కనికిఁ బ్రాఁతయు నొక్కని యందుఁ జూడన
గ్గల మగు ప్రేమ పల్వురకుఁ గల్గుట యద్భుత మిట్లు గాన ని
వ్వెలఁదులయందుఁ గూర్మి పస వీనికి నేమియు లేదు వీనియం
దలవడఁ గల్గ దీ జలరుహాక్షులకుం బ్రియ మెవ్విధంబునన్. 70

క. మనజేశుఁడు కొలిచిన పరి
జనములతో నిష్ఠగోష్ఠి సలిపెడిచో నె
ట్లనురాగ మట్లు కూరిమి
వనితలు పెక్కండ్రయం దవశ్యము పతికిన్. 71

క. ఈ నెలఁత లీమహీశున
హీనగతిన్ దగిలి రేని నితఁ డొక లేమన్
దా నెలమిఁ గూడునెడ నే
మానిని ప్రాణేశుమీఁదఁ మమత మెలంగున్ 72

క. కావున దాసీనికరము
కైవసమై సంచరించు క్రమమున విద్యా
ప్రావీణ్యవైభవోన్నతి
చే వచ్చినవారి వీరిఁ జెప్పకు మింకన్. 73

ఆ. తగులు నెవ్వఁ డొక్క తరుణికి నొకనికి,
మెలఁత నలచు నదియు మేలనంగ
వచ్చుగాని పెక్కు వనితలపైఁ గూర్మి,
గలుగు ననుట బొంకు గాదె తరుణి. 74

చ. పలుకులు వేయు నేమిటికి భాగ్యసమన్విత నేన మద్విభుం
డిలఁ గలధన్యుఁ డంచు నెలుఁగెత్తి వసూధిపపట్టి యుండటం
బలుకు రథాంగమానవతి పల్కులతం డిల జంతుమండలీ
విలసదశేషభాషలఁ బ్రవీణుఁడు గాన యెఱింగి సిగ్గునన్ 75

క. తల వాంచి యుస్సురని మదిఁ,
దలపోయుచు మానరాని తమకంబున నా
నెలతలతో నూఱేఁడులు
విలసితగతిసౌఖ్య మనుభవించుచు నెలమిన్. 76

శా. కాంచెన్ భూవిభుఁ డొక్కనాఁడు కనకాఖర్వప్రభామంజులా
స్యాంచన్నేత్రచకోరత్న విభ్రము సనాథానూన దృగ్రోచులన్
మించుం బ్రాయపులేడిపిండు తను గూర్మిం జుట్టి రా దద్వనో
దంచద్భూమి చరించు నొక్క హరిణోత్తంసంబు నింపారఁగన్. 77

క. కని సతులకుఁ జూపెడుతఱి
ఘనముగ దను చెవులు వాలుఁగన్నులు సోలన్
మొన పెలవి యెత్తి ప్రియు నా
ననమున్ మూర్కొనుచు నవ్వు నాకను వేళన్. 78

శా. హుంకారం బొనరించి వే తలఁగుఁ డోహో నేను స్వారోచినే
పంకేజాక్షులతోడ నెల్లపుడు దర్పస్ఫూర్తి క్రీడింప న
జ్జంకారం బడఁగించినారు తలపోయన్ నా సఖీయుక్తి మీ
రింకం బోయి చరింపుఁ డొక్కరుని భోగేచ్ఛన్ నివారించితిన్. 79

చ. బరువన కింతులం దనకుఁ బల్వుర గూర్చుట భోగవాంఛ గా
కరయఁగ నొండుగాదు ధన మన్న బ్రభుత్వంబు గనంగ రాజనో
త్కరసముపార్జితం బటులు గావున వీనికి లే దిహంబునుం
బరమును నన్ను నట్ల పలుపన్ బనిలే దిది చెప్ప నేటికిన్. 80

క. వీనివిధంబున కనితా
దీనుఁడనై పెంపుదక్కి తిరుగుచు నుండం
గా నే వెఱ్ఱిని తమకము
మానిచనుం డన్న నవియు మగులక చనియెన్. 81

క. ఈకరణి దూఱి నాడియు
నాకృష్ణమృగంబుపల్కు లట మున్నుగ న
శోక సతియున్న మాటలు
నేకంబై తనమనంబు నెరియఁ జేయున్.

ఉ. అరయ నిట్టిరోతలవు నాలయముల్ జలజాక్షు లేటికిన్
వీరలతోడి సంగమిఁక వీడెద నంచుఁ దలంచి తోన దు
ర్వారములైన కోరికల వంక వివేకముచొప్పు దక్కియుం
పారఁగ నాఱునూఱు సురహాయనముల్ చరియించెఁ గ్రమ్మఱన్ 83

వ. తదనంతరంబ క్రమక్రమంబున మనోరమయందు విజయుండును విభావసి
యందు మేరునందనుండును కళావతియందు విభావసుండు నను నందనులం
గాంచి పద్మినీ విద్యాప్రభావంబునం బాకశాసన దిశాముఖంబున విజయునకు
విజయాఖ్యపురంబును గిన్నరేశ్వరహరి దంతంబున మేరునందనునకు గంధ
వతియను పుటభేదనంబును దక్షిణంబున విభావసునకు ధారాహ్వయోదార
మహానగరంబునుం గల్పించి యనల్పవిభవంబున నక్కుమారుల నప్పట్టణం
బులకుఁ బట్టంబు గట్టి కృతార్థుండై యొక్కనాఁడు. 84

ఉ. శాసితశత్రుఁ డానృపతి చంద్రుఁడు తూణధరుండు సజ్యబా
ణాసన పాణిపంకజుఁడునై మృగసంఘములెల్ల బెల్లు సం
త్రాసము నొందఁ గ్రూరత నరణ్యమునన్ మృగయాకుతూహలో
ల్లాసమునం జరించెఁ జలలక్ష్యవిభేదవిధావధానుఁడై. 85

వ. ఆసమయంబున. 86

క. కుటిలకృశసాంధ్యరజనీ
విటకోరక కోమల చ్ఛవిస్ఫుట దంష్ట్రో
ద్భట పోత్ర ఖనిత్రాగ్ర
స్ఫుటితవనీధాత్రి నొక్క పోత్రిం గనియెన్. 87

సీ. జంభారి భిదుర సంరంభంబు వీక్షించి
జరుగు నంజన మహాశైలమనఁగ
ఝంఝాప్రభంజనాస్ఫాలనంబున వెల్కి
యురుగు సంవర్తకాలాభ్రమనఁగ

గతినకంఠకాల కంఠమూలము వాని
వెసరచ్చు నుజ్జ్వల జ్వాళ మనఁగఁ
కలుషదూర్వహ ఖలోత్కరముపై బఱతెంచు
దండధర క్రూర దండమనఁగ

తే. ఘురుఘురారావసంఘాత ఘూర్ణమాన
సప్తపాథోధిపాథః ప్రచండనక్ర
తిమితిమింగిల మగుచు సభ్రమమును మహీయు
గ్రమ్మకొని వచ్చు నొక యేకలమ్ము గనియె. 88

మ. కని మార్వినదంబు సేయుచు భుజంగ క్రూరనారాచముం
దన దోర్దండకృతాంతదండనిభకోదండంబునం గూర్చి బో
రన నేయం దమకించుచుండ నొక సారంగాంగనారత్న మ
జ్జననాథాగ్రణిఁ జేరి పంచజనభాషా ప్రౌఢిమై నిట్లనున్. 89

క. నృప యీ క్రోడము నీకే
యపకారము సేసె దీని నలుగగ నేలా
కృప మదిఁ జొనుపక నాపై
నిపు డీశర మేసి నిగ్రహించుట యొప్పున్. 90

క. అని పలుక నతఁడు నీవీ
తనువు పయిన్ రోయ నేల తద్దయుఁ గృశమై
యునికియుఁ గాదె గదా చెపు
మనవుడు నాహరిణివల్కె నవనిపతికిన్. 91

తే. అన్యసతులయందు నాసక్తుఁ డగువాని
దమక మొందవికూడ దలఁచుకంటె
మరణమైన మేలు మఱి వితర్కింపంగ
ననుచు పలుకుటయును నవనివిభుడు 92

క. తావకహృదయం బెవ్వని
పై వదలక నిలిచె నీదు భావము తెలియం
గా వలయుఁ జెప్పుమన్న ధ
రావల్లభుతోడ హరిణి క్రమ్మఱి నగియెన్. 93

చ. చెదరక నామనంబు నృప శేఖర నీయెడ నిల్చి మన్మథ
ప్రదరపరంపరానిహతి పాల్పడ వేగెను నట్లు చాన నా

యద టడగింపు మన్న హరి ణాంగన నీవు నరుండ వేముదం
బొదవగ నీకు నాప మిషు నోచితకృత్యము లెల్లు చేయఁగన్. 94

క. కావుడు నను నాలింగన
మీ వనురాగమున జేయు మింతియు చాలున్
భూవర యన్న గృపార్ద్రిడు
గావున నా నృపతి హరిణిఁ గౌగిటఁజేర్చెన్. 94

సీ. కల్లీమతల్లి లావణ్యసర్వస్వంబు
విమలాంగ రేఖ నావిర్భవింప
మంజులమంజరీ మహితసౌభాగ్యంబు
పరివృత్తి పచవృత్తి బరిణమింపఁ
బల్లవచ్ఛదచారు భావానుభావంబు
మృగుహస్తలీల మూర్తీభవింప
రమణీయముకుళవిభ్రమభాగధేయంబు
కరరుహస్ఫూర్తి సాక్షాత్కరింపఁ
తే. జేసి మృగియై వహించు నక్షిద్వయంబు
భాసురంబుగఁ నయంకపాళిలోన
మించు క్రొమ్మించు నొకమించు మెలఁత యగుచు
నిలుచు నవ్వనదేవత నృపతిఁజూచి. 95

క. పూనిన విస్మయరసమున
మానిని మృగివై చరించి మతి యంగనవై
కానం బడితివి చిత్రం
బే సెన్నడు సెఱుఁగ జెప్పవే తెలియుంగన్. 96

సీ. నావుడు నమర కాంతాతనూభవుఁ జూచి
యివ్వనదేవత నే నరేంద్ర
సకలభూభువనరక్షాదక్షు మనువర్యు
నీయందు బడయు నెన్నికసమస్త
దివిజులు నన్ను బ్రార్థించిన వచ్చితి
ననురాగవతి నైన నను వరించి
పడయుము నాయందు దపత్యంబు దీన నీ
కగు బుణ్యలోక సంప్రాప్తియనిన

గీ. నట్లు కాకయని యార్యుంబు జాయతాక్షి
నేక చిత్తంబుతోడ నంగీకరించె
బాల యట్లు సుఖాంబుధి దేలుచుండి
యంతగర్భిణియై శుభంబగు దినమున. 97

శా. కాంచెం బుత్రు విశాలనేత్రు బృహదురఃపీఠవిభ్రాజితుం
బంచాస్యోద్భటశౌర్యధుర్యఘన శుంభద్బాహు దేజోనిధిం
బంచాస్త్రప్రతిమాను మాఘుని సామ్రాజ్యైక హేతుప్రభూ
తాంచల్లక్షణలక్షితున్ సుగుణరత్నానీకరత్నాకరున్. 98

క. వేడుక నయ్యవసరమున
నాడిరి సురసతులు కిన్నరాంగన లర్థిం
బాడిరి గంధర్వులు గొని
యాడిరి సురతూర్య నినదము లగ్గల మయ్యెన్. 99

తే. అట్లు జయించి స్వారోచిషాఖ్యుడతడు
శాంతిదాంతిదయాసత్యశౌచ నిరతుఁ
డై యశాంతతఁ జిరతపం బాచరించె
నచ్యుతుని గూర్చి యంతఁ గృపార్ద్రుఁడగుచు. 1 0

సీ. నీలమేఘము డాలు డీలు సేయగ జాలు
మెఱుఁగు జామనచాయ మేనితోడ
నరవిందముల కచ్చు లడఁగించు జిగిహెచ్చు
నాయతంబగు కన్ను దోయితోడఁ
బలుగురాయని చట్టుపలక న్నొరపెట్టు
హొంబట్టు జిలుగు గెంటెంబుతోడ
నుదయార్క బింబంబు నొఱపు గడంబంబు
దొరలంగ నాడు కౌస్తుభముతోడ

గీ. జయజయధ్వని మౌళి నంజలులు సేర్చు
శర్వ శతధృతి శతమన్యు శమనశరధి
పాలకైలబిలాద్రి దేవాళితోడ
నెదుట బ్రత్యక్షమయ్యె లక్ష్మీవరుండు 102

క. ఈ తెఱగున దోఁచిన హరి
కాతఁడు సాష్టాంగ మెఱఁగి యంగము పులకా

స్మేరతంబుగ హర్షాశ్రువు
లేతేరఁగ జూచి భక్తి నిట్లని పొగడెన్. 103

కపిరాజవిరాజితము.

జయ జయ దానవదారణకారణ శార్ఙ్గరథాంగగదాసిధరా
జయ జయ చంద్రదినేంద్రశతాయుత సాంద్రశరీరమహఃప్రసరా
జయ జయ తామరసోదరసోదర, చారుపదోజ్ఝితగాంగఝరా
జయ జయ కేశవ కేశినిషూదన శౌరి హరీ దురితాపహరా. 104

సీ. అవ్యయానంత విశ్వాత్మక విశ్వేశ
బ్రహ్మవు నీవ కపర్ది నీవ
యింద్రుండ నీవ వహ్నివి యనిలుడ నీవ
వరుణుండ నీవ భాస్కరుడ నీవ
యముడ నీవ వసూత్కరము నీవ రుద్రులు
నీవ యాదిత్యులు నీవ విశ్వు
లీవ మరుత్తులు నీవమంత్రములు నోం
కృతివషట్కృతిశ్రుతి స్మృతులు నీవ

తే. వేద్య మీవ యారచ్చిన విబుధగణము
సర్వమును నీవయెట్లన్న సర్వగతుడ
వగుట నుతి నీవు గానివాడనఁగ నెవ్వఁ
డరయఁగను శేషభూతసమస్త శేషి. 105

మ. పరతత్త్వం బగు నీవు మోక్షపుఁగరముల్ పద్మాక్ష కీర్తించెదన్
బురుషార్థప్రసితి నొప్ప నిన్ను గరుణాంభోధిన్ భవార్తున్ జడున్
శరణార్థిన్ నను గావఁగాదగు ప్రధానవ్యక్త కాలాత్మ యీ
శ్వరభూతంబుల కీవె కర్తవును బ్రోవన్ భర్తవున్ హర్తవున్. 106

చ. విలయతమిస్రవేళ నతి వేలమహాంబుధి నూర్ధ్వలోక వా
సులు వశులై కనుంగొనెడు చూడ్కిన కార్యహుతాశనక్రియా
కలితగతిన్ వెలుంగు ఘనకాయవిజృంభణ దోరమీనవై
కలయఁగ గ్రాలు నీవెడద కన్నులు ప్రోచు మమున్ మురాంతకా. 107

చ. చటులకృపీటసంస్థితరసాసరి క్రీలక యుండ గార యి
చ్చుటవను బోలె శంఖమణి శుక్తికదంబము నగ్గగా విశ్ర

కటచరమాంగ మంథగిరి ఘట్టనఁ జెంది ఘనకట్టమై కృపా
పటిమ జగంబుఁ బ్రోచు నల ప్రాక్కమఠంబ నినున్ భజించెదన్. 108

చ. ఉరుతరవిగ్రహస్ఫురణ నుబ్బనినీరుపరిచ్ఛిదాముఖాం
తరమున దోరమై యెగయు ధార నజాండము గాజుతిప్పితో
సరియనగా దలాతలరసాతలసీమలు సించి ధాత్రి ను
ద్ధరణ మొనర్చినట్టి నిను నాదివరాహము నాశ్రయించెదన్. 109

మ. కరుణించున్ మము నట్టి నీదు భుజయుగ్మం బెద్ది పూనెన్ నభో
తరసీమన్ దితిజాంత్రసక్తనఖసంతానంబుతో నొప్పు కే
సరి రాత్రించరభీతికై త్రిభువనాస్థానీయవీథిన్ విక
స్వరశోణప్రసగలం కృతక్రకచ భాస్వత్తోరణస్తంభతన్. 110

చ. దనుజబలీంద్రదత్తకర తామగనస్థిత దానవారచే
ననిమిషదైన్యదుఃఖితమహామునిమండల దృశ్యకశ్యపాం
గనయనాంబువుల్ గడిగి కంజభవాండము మోవ లీలమై
బెనిచిన దంభవామను నుపేంద్రుని నిన్ను సమాశ్రయించెదన్. 111

చ. తనదగు సంతతిం గనలి తానె వధించిన పాపముల్ చెడెన్
మునిగడు నాగుణోగ్రకిణముల్ మొనయంగ శమంతపంచక
మ్మున బితృతర్పణచ్ఛలన ముక్కలు వెట్టు భవద్భుజాయుగం
బున కిదె వందనంబు భృగుపుంగవరూప విహంగవాహనా. 112

మ. పవిధారాపతనంబు గైకొనని యిప్పొలుస్త్వమై సప్తధా
తువులం దూఱు పరిశ్రమంబునకు నుద్యోగించె నాసప్తసా
లవిభేదం బొనరించి నిల్వక గలీలం జన్న యమ్మమ్మరు
జ్జరనాస్త్రంబొసఁగున్ సిరుల్ రఘుకులస్వామీ రమావల్లభా. 113

క. పెరుగు ప్రలంబుని వీపునఁ,
గరిపై హరివోలె విశద కాంతి నిలిచి త
త్కరణం బారాటముగా,
బరిమార్చిన నీదుబలిమి బ్రణుతింతు హరీ. 114

తే. కొలుతుఁ దాదృగ్భవద్బాహు బలిశయుష్ఠి
బెద్ది గిరివోలె గడుపులో వృద్ధిపొందఁ
బగిలి రాకాసిదేహంబు మొగపుముత్య
మయ్యె ముంగాముఁరారి రంగైమురారి. 115

క. కృతయుగ మేతేర నలం,
కృతికై కాశ్మీరపంకమిడి తులువ క్రియన్,
క్షితియెల్ల మెచ్చరక్త
ఫ్లుతముగ గావించుకొను బాగదెద నిన్నున్. 116

వ. అని ప్రస్తుతించినం బ్రసన్నుండయి పాంచజన్యధరుండు వాత్సల్యంబున వత్సా! వరంబు వేడుమనుటయుం బ్రసాదంబని స్వారోచిషుం డిట్లనియె. 117

క. దేవ భవద్దాస్యసుఖం,
బే వేడెద దయజేదగుదు నే సాలోక్యం
బీవే యితరము లొల్లన్,
నావుడు నాతనికి బద్మనాభుం డనియెన్. 118

క. సాలోక్యము దుది నిచ్చెద,
నేలుముల ద్వితీయ మనుత వీవైనయధ
ర్మాలోలబుద్ధి దిరముగ,
నేలుపుతత దపుసుతను విధికి బ్రియము గాన్. 119

చ. అని మహిమన్ మనుత్వమున నాతని బట్టము గట్టి పద్మలో
చనుడు విరించి శర్వముఖ సర్వసుపర్వులతో నదృశ్యుడై
చనియె నిజాలయంబునకు శాస్త్రవినిశ్చయయుక్తి దండపా
లనముల నవ్విభుండు బ్రజలం బ్రజ లట్లరసెం గృపామతిన్. 120

సీ. వానలు వరవితో వర్షించె సస్యముల్
బ్రేళ్ళగొల్చుగ విఱ్ఱవీగి పండె
నారోగ్య పుత్రపౌత్రైశ్వర్యవంతులై
బ్రదికిరి నూఱేండ్లు బంచజనులు
పూవుంబోడులు పతి దేవతలై రగ్ని
భయ తస్కర వ్యాధి భయము లడగ
ఫలపయఃకుసుమాది బహుపదార్థంబులు
రసగంధ సామగ్రి రెసక మెసగ

తే. నిత్యవుద్భవ మృత్యురాహిత్య యుక్తి
ధరం బ్రజావృద్ధి తామరతంపరయ్యె

న్యాయపథమున స్వారోచి షాఖ్య మనువు,
శ్రీల బెంపొంది పాలించు కాలమునను. 121

క. కోరిక నీస్వారోచిషు,
చారిత్రమువినిన వ్రాయఁ జదివిన ధనధా
న్యారోగ్య పుత్రవంతులు
నై రూఢిగ గంద్రు పిదప నమరత్వంబున్. 122

తే. అని మృకండుతనూభవుఁ డనుగుశిష్యు
డైన క్రోష్టికి వినిపించి నట్టియీ క
థాసుధాధార నించిరి దయ దలిర్ప
జైమిని శ్రుతిపుటముల శకునివరులు. 123

శా. వ్యాయామస్థిరసంధిబంధ కటకాధ్యక్షానుగక్షోణిభృ
త్కాయచ్ఛేదవిధావిభీమరదోః ఖడ్గాగ్ర యగ్రాచల
జ్యాయఃకీర్తిభరప్రపంచపరపంచా గామరామామణీ
గేయామేయజయాంక పంకజదృగంగీకారధీరాకృతీ. 124

క. కాంతాలతాంతశర యే
కాంతిఃభక్తప్రతోషితాంభోధి సుతా
కాంతా ప్రతాప రవి శశి,
కాంతాయితవిమతనృపతి కాంతాహృదయా. 125

వనమయూరము :

రాజపరమేశ ఫణి రాజబలపుల్లాం
భోజముఖ భోపముఖ భూప విపులాంసో
త్తేజితధరాధరణదీక్షితభుజా ని
ర్వ్యాజజయదాజి విజితారి నృపరాజీ. 126

ఇది శ్రీ మదాంధ్ర కవితాపితామహ సర్వతోముఖాంక పంకజాక్ష
పాదాంబుజాధీన మానసేందిందిర నందవరపుర వంశోత్తంస
శఠకోపతాపస ప్రసాదసమాసాదిత చతుర్విధకవితామతల్లి
కాల్లసాని చొక్కయామాత్యపుత్ర పెద్దనార్య
ప్రణీతంబయిన స్వారోచిష మను సంభవం
బను మహాప్రబంధమునందుఁ సర్వంబును
షష్ఠాశ్వాసము
సంపూర్ణము.

# పౌరాణిక నాటకములు

| | | | |
|---|---|---|---|
| సుందోపసుందుల వధ అను తిలోత్తమ | 1-50 | చింతామణి | 1-75 |
| పద్మవ్యూహం | 1-50 | సామ్రాజ్య పట్టాభిషేకం రామరావణ యుద్ధం | 1-50 |
| సావిత్రి (శ్రీ. స.) | 1-50 | కృష్ణ జాంబవంత యుద్ధము నాటకం | 1-50 |
| తులసీదేవి | 1-50 | దశావతారములు | 1-00 |
| కృష్ణలీల (బళ్ళారి) | 1-50 | ప్రమీలార్జునీయం | 1-00 |
| భక్తకుచేల | 1-50 | రుక్మిణీ కల్యాణం | 1-25 |
| విభీషణ పట్టాభిషేకం | 1-50 | ప్రహ్లాద | 1-00 |
| గయోపాఖ్యానం (చి. ల.) | 1-75 | శశిరేఖ | 1-00 |
| చతురచంద్రహాస | 1-50 | భీమప్రతిజ్ఞ | 1-00 |
| సారంగధర | 1-50 | జయంతజయపాల | 1-00 |
| సంపూర్ణ భారతం | 1-50 | రామదాసు | 1-00 |
| కనకతార (చం. కే.) | 1-50 | పాండవ అజ్ఞాతవాసం | 1-00 |
| చిత్రాభ్యుదయం | 1-50 | శ్రీకృష్ణ తులాభారం | 1-00 |
| ప్రసన్నయాదవం | 1-50 | అర్జున ప్రతిజ్ఞ | 1-00 |
| సత్యహరిశ్చంద్ర (బ. ల. కవి) | 1-75 | గులేబకావళి | 1-00 |
| భక్తకబీరు | 1-00 | కురుక్షేత్రం | 1-50 |
| మధుసేవ | 1-00 | బాలనాగమ్మ లేక మాయల | |
| దానవీరకర్ణ | 1-00 | పకీరు (కణ్వశ్రీ) | 2-00 |
| సతీసక్కుబాయి | 1-50 | గర్వభంగం | 1-00 |
| ఊర్వశి (జంపన) | 1-50 | పాదుకా పట్టాభిషేకము | |
| కృష్ణ రాయబారం | 1-50 | | 1-00 |
| లవకుశ | 1-50 | పాండవ విజయము | 1-75 |
| భక్తతుకారాం | 1-50 | పాండవ వుద్యోగం | 1-75 |
| మహాకవి కాళిదాసు | 2-00 | స్త్రీ | 1-50 |
| పారిజాతాపహరణం | 1-50 | హనుమద్రామ సంగ్రామం | |
| బొబ్బిలియుద్ధం (శ్రీపాద) | 1-50 | (బ. గో.) | 1-50 |
| సంపూర్ణ రామాయణం | 1-50 | సీతారామాంజనేయం | |
| మహారథి కర్ణ | 1-50 | (తా. సు.) | 1-50 |

# శ్రీ మహాభారతము - వచనము

18 పర్వములు — 16 వాల్యూములు

మంత్రి లక్ష్మీనారాయణశాస్త్రి ప్రణీతము

| | | |
|---|---|---|
| ఆదిపర్వము | | రు. 4–50 |
| సభాపర్వము | | 1–25 |
| అరణ్యపర్వము | 1 వ భాగము | 3–00 |
| డిటో | 2 వ భాగము | 3–00 |
| విరాటపర్వము | | 3–00 |
| ఉద్యోగపర్వము | | 3–00 |
| భీష్మపర్వము | | 4–00 |
| ద్రోణపర్వము | | 4–00 |
| కర్ణపర్వము | | [illegible] |
| శల్యపర్వము | | [illegible] |
| సౌప్తికపర్వము | | [illegible] |
| స్త్రీపర్వము | | [illegible] |
| శాంతిపర్వము | | [illegible] |
| ఆనుశాసనికపర్వము | | 4–00 |
| అశ్వమేధపర్వము | | 1–50 |
| ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణ పర్వములు | | 1–50 |

పూర్తి సెట్టు వెల రు 43–25.

ప్రచురించువారు :—

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో, రాజమండ్రి



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA116B110 |
| పుస్తకం పేరు | మను చరిత్రము |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 139 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | r.Daveen |
| పేజీలు విడదీసినది | K.Daveed |
| స్కాన్ చేసినది | Haseena |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | GOOD |